

# ఆంధ్రపత్రిక

స చి త్ర వా ర ప త్రి క

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 19-4-1950

రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారు బొంబాయి రేవులో భారతీయ యుద్ధనౌక "ఢిల్లీ"పై నావికులకు ఉపన్యసించుట



త్రోవగుంట ఐ. ఎల్. టి. డి. లేబరుయూనియన్ ప్రథమవార్షికోత్సవసందర్భంలో తీయబడిన ఫోటో.

| సంవత్సరచందా<br>రు. 12-0-0<br><br>విడిప్రతిక<br>4 అణాలు | # ప్రతిబుధవారము ప్రకటింపబడును.<br>ఒరులేయవి యొనరించిన నరవర' యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము)<br>**Founder : K NAGESWARA RAO.** | సంపుటము **42**<br><br>సంచిక **33** |
|---|---|---|

విక్రృతి సంవత్సర వైశాఖ శుద్ధ విదియ బుధవారము



తిరువణ్ణామలైలోని అరుణాచలేశ్వర ఆలయం



ఆంధ్రపత్రిక

1950–వ సం॥ ఏప్రెల్ నెల 19–వ తేది బుధవారము

# భగవాన్ శ్రీరమణ మహర్షి

గాంధిమహాత్మునకేమైన సందేశమిచ్చెదరా యని డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఒకప్పుడు భగవాన్ శ్రీ రమణమహర్షిని అడుగ, 'ఇచట పనిచేయుచున్న శక్తియే అచటను పనిచేయుచున్నది.' అని సమాధాన మిచ్చిరి. అదే శ్రీ రమణమహర్షి ప్రసాదించిన ఆధ్యాత్మిక సందేశము. శ్రీ రాజగోపాలాచారిగారు గతసంవత్సరము పాతాళలింగగుహావిష్కరణ చేయుచు తెలిపినట్లు "శ్రీ రమణమహర్షి భారతదేశ ఆధ్యాత్మిక ప్రతిభను ఈ తరమువారిలో ప్రజ్వలింపజేయుచుండిరి."

భగవాన్ శ్రీ రమణమహర్షినిర్యాణముతో ఒక యుగము పరిసమాప్తమైనది. భారతదేశప్రాచీన ఆధ్యాత్మికసంప్రదాయమును తరతరములకు అందచేయుచు తాము తరించి, ఇతరుల తరింపచేసిన మహానుభావులలో కడసారివాడు రమణభగవానుడు. ఆ జ్యోతి పరంజ్యోతిలో ఏకమైపోవుటతో ఐహిక ప్రపంచము అంధకారబంధుర మైనది. అంధకారమున వెలుతురు చూపి అజ్ఞానాంధకారమును బారద్రోలిన భగవానుడు నిర్యాణ మందినను వారు ప్రసాదించిన జ్ఞానజ్యోతి నిత్యమై, అమరమై, లౌకిక వ్యాపకములందు నిమగ్నులైనవారికి ఆధ్యాత్మికమార్గమును చూపుచునే యుండును. ఆ మార్గమును గ్రహించి అనుసరింపగల శక్తి సామాన్యులు పొందవలసి యుండును. అట్టి శక్తినికూడ శ్రీ రమణమహర్షి ప్రసాదించెను.

హృదయ కుహరమధ్యే
కేవలం బ్రహ్మమాత్రం
హ్యహమహ మితి సాక్షా దాత్మ
రూపేణ భాతి!
హృది విశ మనసా స్వం చిన్వతా
మజ్జతా వా
పవనచలనరోధా దాత్మ
నిష్ఠో భవ త్వం॥

అన్న 'గీత' లో శ్రీరమణమహర్షి ఈ శక్తిని పొందుటకు గల మార్గమును చూపిరి. "నే నెవరు?" అన్న ప్రశ్నకు సమాధానం తెలుసుకొనుటకు ప్రయత్నింపుమని భగవానుని ఆదేశము; ఉపదేశము కూడ. ఆ సమాధానాన్వేషణలో 'నా' అన్నది నశించి 'సర్వం బ్రహ్మం' అన్న సూత్రాన్ని గ్రహింపగలరని శ్రీరమణమహర్షి ప్రబోధము. వారి ప్రబోధసారమును గ్రహించి వారు నిర్దేశించిన మార్గమును అనుసరించి వారికి మనము తగిన భక్తులము కావలెను.

ఐహికవ్యాపకములకు ప్రాధాన్య మెక్కువై, హేతువాదప్రాబల్యము అధిక మగుచున్న ఈ శతాబ్దమున భగవాన్ శ్రీ రమణమహర్షి అవతరించి ఆధ్యాత్మికచింతనే అన్ని ఐహికసమస్యలకు పరిష్కారమార్గ మని నిరూపించిరి. ఆ మార్గమును అనుసరించి తరించిన, నేటి సంక్షుభితప్రపంచమున శాంతి సుస్థిరము కాగలదు. వారిఆత్మ, పరమాత్మతో లీనమై వారు అవతారము చాలించిన సమయమున కన్పించిన వెలుగు ప్రపంచమును నేడావహించిన అంధకారమును శాశ్వతముగ బారద్రోలి మానవకోటికి భక్తిమార్గమును చూపి మానవుని సన్మార్గానువర్తిని చేయుగాక!

# కాశ్మీరు మధ్యవర్తి

కాశ్మీరుమధ్యవర్తిగ భారత,పాకీస్థాన్ ప్రభుత్వములు సర్ ఓవెన్ డిక్సన్‌ను అంగీకరించుటవలన భద్రతామండలి మార్చి 14వ తేదీన చేసిన తీర్మానములో అత్యంతక్లిష్టమైన వ్యవహారము పరిష్కారమైనది. జనవాక్యనిర్ధారణాధికారినే మధ్యవర్తిగ

# విషయానుక్రమణిక

## 19 ఏప్రెల్ 1950



నియమింపవలె నని కొందరు తీవ్రప్రయత్నములు చేసిరి. భద్రతామండలి ఆ ప్రకారమే అడ్మిరల్ నిమిట్జ్‌నె మధ్యవర్తిపరిష్కారమునకు నియోగించిన అట్టి ఏర్పాటుకు భారతప్రభుత్వము ఎన్నటికిని సమ్మతింపజాలదు. జనవాక్యనిర్ధారణాధికారి నిర్వహింపవలసిన విధులు, బాధ్యతలు, మధ్యవర్తిబాధ్యతలు, విధులు భిన్నమైనవి. సర్ ఓవెన్ డిక్సన్ వివాదగ్రస్తమైన ప్రాంతమునుండి సైనికోపసంహరణకార్యక్రమమును సాధించి జనవాక్యనిర్ధారణాధికారి తన కార్యక్రమమును నిర్వహించుటకు అనుకూలమైన పరిస్థితులను కల్పింపవలసి యున్నది.

కాశ్మీరుకమీషన్ బాధ్యత, అధికారములు మార్చి 14-వ తేదీ భద్రతామండలితీర్మానముప్రకారము మధ్యవర్తిపర మగుచున్నవి. సర్ ఓవెన్ డిక్సన్ సైనికఉపసంహరణవిషయమున నే గాక, ఇతరవివాదములపైనను భారత-పాకిస్థాన్ ప్రభుత్వములకు సమాధానము కుదుర్చవచ్చును. భారతప్రభుత్వము సమ్మతింపక పోయినను, కాశ్మీరుప్రభుత్వము ప్రతిఘటించినను భద్రతామండలి అనుసరించుచున్న విధానమును బట్టి సంస్థానవిభజన తప్పదనియే భావింపవలసివచ్చుచున్నది. గిల్గిట్ ప్రాంతమును పాకిస్థాన్ ప్రభుత్వమప్పుడే పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రమున చేర్చినట్లును పెషావర్ ప్రభుత్వమే ఆప్రాంతపరిపాలనను నిర్వహించుచున్నట్లును ఇటీవల వెల్లడి యైనది. ఇప్పటికి ఇంకను పాకిస్థాన్ సైనికఆక్రమణలో నున్న ఇతర ప్రాంతములవిషయమునను కరాచీప్రభుత్వము ఇదే వైఖరిని అవలంబింపవచ్చును.

ఈ ఏర్పాటు లన్నింటిని యథాతథముగా ఉంచి సంస్థానమునందు జనవాక్యనిర్ధారణ జరిపినా ఫలితం మరోవిధంగా ఉండబోదు. 1918 ఆగస్టు 13 తీర్మానాన్ని భారత, పాకిస్థాన్ ప్రభుత్వములు అంగీకరించిన నాడే కాశ్మీర్ విభజన స్థిరపడినది. అప్పటినుండి జరుగుతున్న కార్యకలాపం అంతా ఈ తీర్మానాన్ని అనుసరించే గనుక విభజన తప్పనిసరి అవుతున్నది.

ఈ విషయమై సర్ ఓవెన్ డిక్సన్ భారత-పాకిస్థాన్ ప్రభుత్వములకు సమాధానము కుదుర్చకలిగిన అడ్మిరల్ నిమిట్జ్ నిర్వహింపవలసిన కార్యక్రమము ఏమియు ఉండజాలదు. పాకిస్థాన్ ఇందుకు భిన్నమైన ఏ పరిష్కారమునకును సమ్మతింపదు. జనవాక్యనిర్ధారణ ఫలితం పూర్తిగ తమకు అనుకూలంగా ఉండగలదని పాకిస్థాన్ కూడ భావించుటలేదు. కాశ్మీర్లో ఇంతకాలముండి ఏమి సాధింపక వైదొలగుటకు సమ్మతింపదు. కాని భారతదేశము జనవాక్యనిర్ధారణ జరుగక, పాకిస్థాన్ ఆక్రమణలో నున్న భూభాగమును పాకిస్థాన్‌కు వప్పగించుటకు ఎన్నటికిని సమ్మతింపదు. కాశ్మీర్ మధ్యవర్తి ఈవిషయమై సమాధానమును సాధించుటకు పూర్వము సంస్థానమునుండి పాకిస్థాన్ సేనల ఉపసంహారము జరుగునట్లు చూడవలసియున్నది. ఏవిధమైన పరిష్కారమునకైనను ఇది ఆవశ్యకము. సర్ ఓవెన్ డిక్సన్ ఈ విషయమును గ్రహించి, వ్యవహరించిన కాశ్మీర్ సమస్య స్థిరముగ పరిష్కారము కాగలదు. భారతదేశమునకు అంతకంటె ఎక్కువ న్యాయం జరుగగల అవకాశముగాని ఆశగాని ఏమీ కన్పించుట లేదు.

# నేటిప్రపంచం

నెహ్రూ, లియాఖత్ ఆలీఖాన్లకు సమాధానం కుదిరిందన్న కబురు తెలియగానే పాకిస్తాన్‌కు ప్రయాణం కట్టి పొలిమేర వరకూ వెళ్ళిన అయిదువేలమంది మహమ్మదీయులు స్వగ్రామానికి తిరుగు ముఖంపట్టారు. ఇంటికి వెళ్ళేముందు అజ్మీర్‌లో ఉత్సవం చూసే అవకాశంకూడా వారికి లభించింది. కాని అవైపున తూర్పుబెంగాల్ నుంచి ఇట్లా ఆస్తులు విడిచి వచ్చేవారు మాత్రం స్వగ్రామాలకు తిరిగివెళ్ళడం క్షేమంకాదని తలిచి సమకట్టిన ప్రయాణాన్ని పూర్తి చేస్తున్నారు. తూర్పు బెంగాల్ నుంచి భారత దేశానికి వస్తున్న హిందువులసంఖ్య కొద్దిగా తగ్గి ఉండవచ్చును. కాని శరణార్థుల ప్రవాహం తెగలేదు.

అదేరీతిగా నెహ్రూ - లియాఖత్ ఆలీ ఖాన్ల మధ్య కుదిరిన ఒడంబడికవల్ల ఉభయ దేశంలో యుద్ధంలోకి దూకే ప్రమాదం తప్పిపోయింది. భారతదేశంలో మహమ్మదీయులకు తమ క్షేమానికి ఇంక భంగంలేదనే విశ్వాసం కలిగింది. కాని తూర్పుబెంగాల్లో హిందువుల క్షేమంగురించి భారత దేశవాసుల సందేహం తీరలేదు. దేశంలో అసంతృప్తి తీవ్రతరమయింది.

భారతదేశంలో మహమ్మదీయులు భయాలు తొలగి నిట్టూర్పు విడిచారు. కాని తూర్పు బెంగాల్లో హిందువులు ఏమనుకుంటున్నారో ఒక్క నాయకుడూ ఇంతవరకూ తెలపలేదు. వారికి విశ్వాసం కలగలేదంటే నమ్మవచ్చును.

ఈపరిస్థితికి ఎవర్ని నిందించి ప్రయోజనంలేదు. పండిట్ నెహ్రూ చెప్పినట్లు ఈ ఒడంబడికవల్ల ఏప్రయోజనం కలిగినా కలక్కపోయినా, విశ్వాసం కలిగినా కలక్కపోయినా ఒక్క విషయంమాత్రం సాధించబడింది. ప్రస్తుతానికి యుద్ధప్రమాదం నివారితమయింది. మత కలహాలు ఇప్పటికి చాలవరకు నివారణైనాయి.

## ప్రజలహింసద్వారా రాజకీయప్రయోజనాలు *

తూర్పుబెంగాల్లో మతకలహాలకీ కాశ్మీర్ పరిస్థితికీ సంబంధం లేకపోతే దని ఇదివరలో పండిట్ నెహ్రూ అన్నారు. అంతే కాదు. అసలు మతకలహాలన్నిటికీ ఆంతర్యం రాజకీయోద్దేశాలనే విషయాన్ని మరిచిపోకూడదు. కలకత్తా నౌఖాలీ త్రిపురాలలో మత కలహాల ఫలితంగా దేశవిభజనకు కాంగ్రెస్ ఆమోదించింది. దేశవిభజన జరిగిన వెంటనే పంజాబ్‌లో సంభవించిన మత కలహాలఫలితంగా పశ్చిమపాకిస్తాన్‌నుంచి ధనవంతులూ, ఆస్తిపరులూ అయిన హిందువులందరూ పారిపోయినారు. కాశ్మీర్‌లో రెచ్చగొట్టబడిన మతకలహాల ఫలితంగా ఆ దేశంపైకి పఠాన్లనీ, పాకిస్తాన్ సైనికులనీ పంపడానికి వీలు చేకూరింది. ప్రస్తుతమతకలహాలఫలితంగా పాకిస్తాన్ రూపాయి మారకపువిలువ మార్చనక్కరలేకుండానే వాణిజ్యపు టొడంబడిక కోసం సమాలోచనలు జరపడానికి భారత ప్రభుత్వం అంగీకరించింది. తూర్పుపాకిస్తాన్‌లో ఆర్థికసంక్షోభాన్ని మహమ్మదీయులు భరించడానికి వీలు కలగడమే కాకుండా, హిందువుల్ని దోచబెట్టి మహమ్మదీయుల అసంతృప్తిని కొంతవరకూ తీర్చడానికికూడా వీలుకలిగింది. భారత రాజకీయవ్యవస్థలో తావులేకుండా పరపతి కోల్పోయిన ముస్లింలీగ్‌కి తిరిగి భారత రాజకీయాల్లో ప్రవేశం కలుగుతోంది. అనగా ద్విజాతిసిద్ధాంతం విషయంలో భారతప్రభుత్వనాయకులు ఒకమెట్టు దిగవలసివచ్చిందన్నమాట. అంతమాత్రాన మన సిద్ధాంతం వీగిపోయినట్లు అంగీకరించారని కాదు. దేశవిభజనకు అంగీకరించినా ద్విజాతిసిద్ధాంతానికి అంగీకరించకుండా దేశాన్ని సర్వమతసమత్వసూత్రాల ప్రకారం పాలిస్తున్నారు. అలాగే ఇప్పుడూ జరుగుతుంది.

ఈ సంవత్సరారంభంనుంచీ జరిగిన మత కలహాలవల్ల దాదాపు 10 లక్షలమంది హిందువులు తూర్పుబెంగాల్ విడిచి కట్టుబట్టలతో వచ్చేశారు. అనేక వేలమంది ప్రాణాలు కోలుపోయారు. ఈ దేశంనుంచి పాకిస్తాన్ పారిపోయిన మహమ్మదీయుల సంఖ్య దాదాపు 24 వేలు. కోట్లకొద్దీ విలువైన ఆస్తిసంపదలు తూర్పుపాకిస్తాన్‌వాసుల పరమైనాయి.

కార్యక్రమం ప్రకారం ఈ సంవత్సరం అనుకున్న కోటా హిందువులు పాకిస్తాన్ నుంచి పారిపోగానే, ఆ దురంతాల ఫలితంగా భారతదేశంలో మహమ్మదీయులకు కూడా ముప్పు వాటిల్లుతున్న సమయంలో, హిందువుల క్రోధాన్ని అణచలేనంత తీవ్రంగా రెచ్చిపోయినసమయంలో భారత ప్రధాని పండిట్ నెహ్రూతో సమాలోచనలకు పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ ఆలీఖాన్ దిగివచ్చాడు.

ఈ ఒడంబడికవల్ల భారతదేశంలో కాంగ్రెస్‌ప్రభుత్వంపట్ల ప్రజలకు అసంతృప్తి అవిశ్వాసం కలగడంకంటె పాకిస్తాన్ కోరదగిన ప్రయోజనం వేరేమి కావాలి? భారతదేశంలో ప్రభుత్వబలం క్షీణించడం పాకిస్తాన్‌కి ప్రయోజనకరం.

## నిగ్రహానుగ్రహసమర్థులు *

అంటే వీనినిబట్టి మరొక విషయం బోధపడుతుంది. పాకిస్తాన్ కోరినప్పుడు పాకిస్తాన్‌లోనూ, భారతదేశంలోనూ మతకలహాల్ని రెచ్చగొట్టగలుతోంది. భారతదేశంలోని కాంగ్రెస్‌ప్రభుత్వం బోధించి అనుసరించే సర్వమత సమత్వ సిద్ధాంతాలు భారతదేశంలో మతకలహాలు రేగకుండా కట్టలేక పోతున్నాయి. వీనివల్ల రాజకీయ ప్రయోజనాలు సిద్ధిస్తున్నంతకాలం, పాకిస్తాన్ ఈ ఆయుధాన్ని ప్రయోగించడానికి సందేహించదని స్పష్టపడుతూనే ఉంది. వారు ఆయుధాన్ని ప్రయోగించగలరు. దానివల్ల సంభవించే దుష్ఫలితాల్ని భరించి, ఎప్పటికప్పుడు ప్రతీకారం జరక్కుండా చూడ్డానికి తన పరపతిని కూడా ఖర్చు పెడుతోంది. భారతదేశంలో కాంగ్రెస్ ప్రభుత్వం అంటే దెబ్బ తీసేది పాకిస్తాన్‌వంతు, దెబ్బకాసేది భారతదేశంవంతూ అయింది. కాని తిరిగి దెబ్బ తియ్యదు. కాబట్టి ఎవరు ముందూ ఎవరు వెనకా అనిగాని, ఎవరిదితప్పు ఎవరిది ఒప్పు అనికాని ఆలోచిస్తే సందేహం లేకుండా పాకిస్తాన్‌దే తప్పు అని చెప్పడానికి వీలుంది. అయితే

విదేశాల్లో అలా కాకుండా భారతదేశం పైనే నిందమోపుతున్నారు.

పాకిస్తాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్ అమెరికా పర్యటించబోతున్నాడు. తానొక ప్రతిష్ఠ ఆర్జిస్తే గాని అక్కడ ప్రభుత్వం ఎంతగా ఇచ్చకాలు చూపినా ప్రజలు అవహేళన చేస్తారన్న విషయం ఆయనకు తెలుసును. కాబట్టి ప్రతిష్ఠ ఆర్జించుకోడానికి కూడా ఈ అవకాశం వినియోగపడింది.

అయితే ఇంక సాధనమేమిటి అనే సందేహం దేశమంతటా అందర్నీ బాధిస్తోంది. ప్రస్తుతపరిస్థితిలో పండిట్ నెహ్రూ చేసిన చర్యకంటె మేలైనది మరొకటి కనిపించదు. ప్రజలేప్రతీకారం తీర్చుకుంటున్నప్పుడు పాకిస్తాన్‌కి మహమ్మదీయులకి గుణపాఠం చెప్పడానికైనా ప్రభుత్వం ఊరుకోవలసిందని కొందరి అభిప్రాయం. దీనివల్ల యుద్ధమూ చెయ్యనవసరం ఉండదనీ, మళ్లీ పాకిస్తాన్ మహమ్మదీయులు హిందువులపై చెయ్యెత్తేముందు వెనకంజ వెయ్యగలరనీ వీరి ఉద్దేశం. జనాభాల మార్పిడి దానంతటదే జరిగిపోతుంది. కాని ఇది సరిగాదు. దీనివల్ల యుద్ధం సంభవించదనే గారంటీలేదు. ముప్ఫైకోట్ల హిందువులు నాలుగుకోట్ల మహమ్మదీయుల్ని హింసిస్తుంటే పాకిస్తాన్ ఊరుకోదు. భారత రిపబ్లిక్‌లో మతకలహాలు చెలరేగితే దేశంలో ఉన్న నాలుగుకోట్లమంది మహమ్మదీయులు తెచ్చిపెట్టగల ముప్పు ఇంతా అంతా కాదు. అలాగే తూర్పుపాకిస్తాన్లో కూడా. అక్కడ నూరింట 30 మంది హిందువు లున్నారు. పశ్చిమబెంగాల్లో హిందువులకోపం శృతిమించినట్లయితే తూర్పుబెంగాల్‌ని రక్షించుకోవడం అసంభవమని పాకిస్తాన్ప్రభుత్వానికి తెలుసును. కాని భారతప్రభుత్వం శృతిమించనివ్వదనికూడా పాకిస్తాన్‌కి తెలుసును. అందువల్లనే పశ్చిమబెంగాల్లో పరిస్థితి చెయ్యిదాటకముందు పాకిస్తాన్ ప్రధాని జాగ్రత్తపడ్డాడు. పాకిస్తాన్ప్రభుత్వం కోరినప్పుడు కలహాలు తేగలదు. అక్కరలేనప్పుడు మాన్పగలుగుతోంది.

యుద్ధమే ప్రారంభమైతే పాకిస్తాన్ ప్రభుత్వంసహాయంతో తూర్పుబెంగాల్ మహమ్మదీయులు హిందువులు కోటిమందినీ తుదముట్టించే ప్రమాదం ఉంది. ఇంక యుద్ధంవల్ల ప్రయోజనం ఏమీ ఉండదు.

కాబట్టి గత్యంతరం లేక ఇటువంటి ఒడంబడికలకు దిగవలసి వస్తోంది. ఈ ఒడంబడికలవల్ల సమస్య పరిష్కారమూ కాదు. ఒడంబడికలు తప్పనూ తప్పవు.

పోతే ఒక్క విషయంలో పండిట్ నెహ్రూకు విజయం లభించిందని చెప్పాలి. ప్రతి-చిన్న తగువునీ పాకిస్తాన్ పెద్దగా పెంచి అంతర్జాతీయరంగంలో అల్లరి చేస్తోంది. ఆ రంగంలో పలుకుబడిగల ఆంగ్లో-అమెరికన్ వర్గంప్రాపు న్యాయాన్యాయాలతో నిమిత్తం లేకుండా పాకిస్తాన్‌కు లభిస్తోంది.

ఆ ప్రాపు చూసుకుని నాటక మాడుతున్న పాకిస్తాన్‌ని ఆ నాటకాలు పనికిరావని పండిట్ నెహ్రూ తెలియచెప్పారు. తగవు లున్నట్లయితే పరస్పరం నమ్మి సమాధానం చేకూర్చుకోవాలిగాని బలవంతుల అండ సంపాదించుకుని అన్యాయంగా ప్రవర్తించే దుర్జనత్వానికి లొంగబోరని చెప్పారు. కాశ్మీర్‌సమస్యవిషయంలో పరాయివారి తీర్పు పనికిరాదనీ, అవసరమైతే పరాయివారి సహాయంతోనే (మధ్యవర్తిత్వం) పరస్పరావసరాల్ని అభిప్రాయాల్ని గ్రహించుకొని సమాధానం చేకూర్చుకోవాలని పండిట్ నెహ్రూ పట్టుబట్టారు. చివరికి నెహ్రూ మాటే నెగ్గింది.

అలాగే ఈ విషయంలో కూడా అల్పసంఖ్యాకవర్గాల రక్షణనిమిత్తం ఉభయ ప్రభుత్వాలూ కలిసి ఆలోచించి సహకరించాలి గాని, ఈఅల్లరిని అంతర్జాతీయరంగంలోకి ఈడవకూడదని పండిట్ నెహ్రూ అభిమతం. భారతదేశంలో మహమ్మదీయుల్ని సంఘహత్యపాలు చేస్తున్నారని ఐక్యరాజ్యసమితిలో ఆరోపించడానికి పాకిస్తాన్ విదేశాంగమంత్రి శతవిధాల యత్నించాడు. కాని అతని యత్నాలు విఫలమైనాయి.

మూడోదేశం ప్రమేయం లేకుండా వాస్తవంగా ఈ సమస్యల్ని పరిష్కరించగోరినట్లయితే, పాకిస్తాన్ భారతదేశంతో సఖ్యతకోసం ప్రయత్నించవలసిందే. కాని, బలవంతుల అండచూసుకుని తన కోర్కెల్ని భారతదేశం తలపైన బలవంతాన రుద్దడానికి వీల్లేదని పండిట్ నెహ్రూ నిరూపించారు. పాకిస్తాన్ప్రధాని తాత్కాలికంగానైనా లొంగక తప్పిందికాదు. కాశ్మీర్ విషయంలో కూడా భారతప్రభుత్వంపట్ల స్నేహభావంతో ప్రవర్తించినట్లయితేనే సమస్య సవ్యంగా పరిష్కారమౌతుందని దీనివల్ల పాకిస్తాన్‌కు చెప్తున్నారన్నమాట.

ఇంతవరకూ పాకిస్తాన్ అంటనుండి ఆంగ్లో - అమెరికన్ వర్గదేశాలు పన్నిన తంత్రాల్ని గ్రహిస్తేగాని, ఇప్పుడు జరిగిన ఒడంబడిక నైతికంగా పాకిస్తాన్‌కి పరాజయం కలుగచేసిందనే విషయం బోధపడదు. పాకిస్తాన్ ఇంతకాలంగా భారతదేశంపైన మాటిమాటికీ కాలుదువ్వుతున్నా, హిందువులపైన అత్యాచారాలు చేసి అంతర్జాతీయరంగంలో నిందపడకుండా తప్పించుకుంటున్నా, వీటికిబ్రిటన్ అమెరికాల ప్రోద్బలమే మూలకారణం. ఇకనుంచిభారతదేశంతో వచ్చే తగవుల్ని పరిష్కరించుకోవాలంటే భారతప్రభుత్వంతోనే సమాధానంకోసం సిద్ధపడాలని పాకిస్తాన్‌కి తెలుపుతూ, ఆంగ్లో - అమెరికన్ వర్గానికి చెంపపెట్టు పెట్టారన్నమాట.

పశ్చిమబెంగాల్ ప్రభుత్వానికి ఈ ఒడంబడిక నచ్చడం కష్టమే. అయినా తుదిపర్యాయం పాకిస్తాన్ తనమాటను తను పాటించగలదో లేదో, చూడాలనే ఉద్దేశంతో కావచ్చును, ఒడంబడికను అమలు జరపడానికి గీఅంకరించారు. ఈ ఒడంబడిక గాని, పాకిస్తాన్ పట్ల భారత ప్రభుత్వం చూపుతున్న సహనభావంగాని భారతమంత్రివర్గంలోని బెంగాలీమంత్రులైన డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ గారికీ, శ్రీ కె. సి. నియోగీగారికీ నచ్చలేదు. వారు మంత్రిపదవులకు రాజీనామా నిచ్చారు. ఈ పరిస్థితిలో వారు రాజీనామా నిస్తే బెంగాల్లో పరిస్థితిని అదుపులోకి తేవడం కష్టమే అవుతుంది. ఈ ఒడంబడికతో ఉభయదేశాలమధ్యా మైత్రిబాంధవ్యాలు ప్రారంభమౌతున్నాయని పాకిస్తాన్ ప్రధాని చెప్పిన మాటను విశ్వసించకపోయినా, కనీసం ఇప్పటికి ఈ కల్లోలాన్ని అణచడానికైనా ఈ ఒడంబడికను అంగీకరించాలని పండిట్ నెహ్రూ చెప్పిన మాటల్ని అస్సాం పశ్చిమబెంగాల్ మంత్రివర్గాలు పాటించాయి.

## సర్ డిక్సన్ *

దీనితోపాటు కాశ్మీరంలో సైనికోపసంహరణ నిమిత్తం ఉభయదేశాలమధ్యనూ సమాధానం చేకూర్చవలసిన మధ్యవర్తిగా సర్ ఓవెన్ డిక్సన్ నియామకానికి అంగీకారం కుదిరింది. సర్ డిక్సన్ పేరు సూచించబడేముందు చాలా పేర్లు సూచించబడినాయట. భారతప్రభుత్వం సూచించినవారిని పాకిస్తాన్ నిరాకరించింది. ఎలాగైనా బ్రిటిష్

# మనదేశం

## ధ్వంసకాండ *

వేసవి వేడి ముదురుతున్నకొద్దీ దేశంలో ధ్వంసకాండ కూడా హెచ్చుతున్నట్లు కనిపిస్తుంది. అయోధ్య-ఫ్తిర్వాత్ రైల్వేలో తుఫాన్ ఎక్స్‌ప్రెస్ కూలిపోయి 32 మంది మరణించారు, 76 మంది గాయపడ్డారు. ఎవరో ఒకవంతెనవద్ద పట్టాసీలలు తీసి వెయ్యడం వల్ల ఎక్స్‌ప్రెస్ కూలిపోయింది. గుంటూరుసమీపంలో నడికూడువద్ద రెండు రైళ్లు ఢీకొని ఒకడు మరణించాడు. ఆరుగురు గాయపడ్డారు. బెరైలీలో (ఉత్తరప్రదేశం) అగ్నిప్రమాదం సంభవించి అర్ధకోటిరూపాయల నష్టం సంభవించింది. బొంబాయి ఓడరేవులో, కర్కీ ఆర్డినెన్సు డిపోలో రాజఘాట్ శరణార్థుల శిబిరాలలో, గౌహతీలో పాట్నాలో, కాశీలో కూడా అగ్నిప్రమాదాలు సంభవించాయి.

పాట్నాలో ప్రమాదంలో నలుగురు మరణించారు. కిర్కీలో షైకెన్‌సెల్లు మొదలైనవి చాలా దగ్ధమైపోయినాయి. వీనిలో ప్రమాదవశాత్తు సంభవించినవి ఉన్నాయి. ఆతతాయిలు నిప్పు ముట్టించినవీ ఉన్నాయి. ఈ ప్రమాదాలన్నిటివల్లా పదిదినాల్లో కోటిన్నరరూపాయల ఆస్తి నష్టమయింది.

కృష్ణాగుంటూరు జిల్లాల్లోనూ నల్లగొండ వరంగల్ జిల్లాల్లోనూ కమ్యూనిస్టుల దాడులు కనీసం రోజుకొకసారి చొప్పున జరుగుతున్నాయి. పోలీసులుకూడా వీలైనంత మంది కమ్యూనిస్టుల్ని చంపి, వారివద్ద ఆయుధాల్నీ కమ్యూనిస్టు సారస్వతాన్నీ పట్టుకున్నారు. దేశంలో మొత్తంమీద నిర్మాణంకంటె ధ్వంసం అధికమయింది.

## ముఖ్యమంత్రి సంచారం *

చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పూసపాటి చినజగన్నాథ కుమారస్వామిరాజాగారు పదిహేను రోజులుగా ఆంధ్రదేశాన్ని పర్యటిస్తున్నారు. ఆంధ్రదేశంలో పరిస్థితుల్ని, ముఖ్యంగా కమ్యూనిస్టుముప్పునీ స్వయంగా పరిశీలించడానికి సంచారంచేస్తున్నారు. కమ్యూనిస్టుముప్పుని ప్రభుత్వం ఎలా అరికట్టదలిచారో, ప్రభుత్వం ఏయేకార్యక్రమం నిర్వహించగలదో తెలిపి ప్రజలకి ప్రభుత్వం అండ ఉన్నదని ధైర్యంచెప్తారని అనుకున్నారు. కాని వారు కమ్యూనిస్టుల్ని ప్రజలెందుకు చితక్కొట్టలేదని వెళ్లినచోటల్లా అడుగుతున్నారు. ప్రజల్ని పిరికిపందలుగా జమకట్టి మాట్లాడారు. వారితోపాటే పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ దేవసహాయంగారు కూడా సంచారంచేసి ప్రజలకష్టాల్లు తెలుసుకోడానికి యత్నించేబదులు ప్రజలకి పాఠాలు చెప్పడం, వారిని అవహేళన చెయ్యడం ప్రారంభించారు.

ఇదే సమయంలో కాంగ్రెస్ రాజకీయాల్లో తమ వాదాన్ని ప్రజలకు వినిపించాలని ప్రకాశంగారు, తమ వాదాన్ని వినిపించాలని కళా వెంకట్రావుగారు సంచారం ప్రారంభించారు. ఆంధ్రదేశంలోని బస్తీలూ, పల్లెలూ ఈ మాసములో ఈ నాయకుల లెక్చర్లతో మారుమోగుతున్నాయి. స్వాగతపత్రాలు చదివేవారికి తీరిక లేకుండా ఉంది.

మన ముఖ్యమంత్రిగారు తమ ఉపన్యాసాల్లో ప్రజలు కమ్యూనిస్టుల నెలా ఎదిరించాలో విశదీకరించారు. ప్రజలు స్వయంగా చెయ్యిచేసుకోవచ్చు నన్నారు. కమ్యూనిస్టుల్ని కాల్చి వీధిలో పారవేసినా కేసుండదన్నారు దేవసహాయంగారు. ఉత్తరాదిని హిందూ మహమ్మదీయ మతకలహాలు చెలరేగుతుంటే, ప్రజలు చెయ్యిచేసుకో కూడదనీ, పరిస్థితిని ప్రభుత్వమే చక్కబెడుతుందనీ కేంద్రప్రభుత్వం హెచ్చరించింది. దేశంలో దుర్మార్గుల్ని శిక్షించే భారాన్ని ప్రజలు తమపైన వేసుకుంటే అరాచకం చెలరేగుతుందనీ, అలా కామై కర్రలూ కత్తులూ తుపాకులూ తీసుకుని పరమతస్థులపైన పడివ

అమెరికన్ రాజకీయ తంత్రజ్ఞుల్లో ఒకరిని నియమింప చెయ్యడానికి ఆదేశాలు ప్రయత్నించాయి. వారు సూచించిన పేర్లన్నిటినీ పాకిస్తాన్ ఆమోదించింది. భారతప్రభుత్వం నిరాకరించింది. చివరికి న్యాయనిర్ణయంలో ప్రఖ్యాతిపొందిన ఆస్ట్రేలియన్ హైకోర్టు జడ్జి సర్ ఓవెన్ డిక్సన్ నియామకానికి ఉభయప్రభుత్వాలు అంగీకరించాయి సర్. డిక్సన్ న్యాయనిర్ణయంలో నిధి అని పేరు తెచ్చుకున్నారుట. వీరి తీర్పులు అప్పీల్ కోర్టుల్లో ఎన్నడూ తోసివెయ్యబడ లేదుట. యుద్ధకాలంలో వూల్ అమ్మకానికి స్థాపించబడిన కామన్వెల్తుసంస్థకి నిర్వాహకుడుగా పనిచేశారు.

ఒకసారి ఒకతల్లి మూడేళ్ళక్రింద ఆస్పత్రిలో పురుడు పోసుకున్నప్పుడు తన బిడ్డ మారిపోయిందనీ తన అసలుబిడ్డను తనకు ఇప్పింపవలసిందనీ కోర్టులో కేసుపెట్టిందిట.

మారినమాట నిజమైనాసరే మూడేళ్లు పెంపకంవల్ల ఎవరిదగ్గర ఉన్నబిడ్డకి వారే తల్లి అని డిక్సన్ నిర్ణయించారట. ఈవిషయాలన్నిటినీ మనకి తెలుపుతున్నవి బ్రిటిష్, అమెరికన్ వార్తాసంస్థలే. కాబట్టి ఈ న్యాయమూర్తి న్యాయనిర్ణయబుద్ధి సమర్థతనూ మనం స్వయంగా చూడాలి. వీరు కొన్నాళ్లు వాషింగ్టన్‌లో ఆస్ట్రేలియన్ రాయబారిగాకూడా పనిచేశారు.

సర్ ఓవెన్ డిక్సన్ త్వరలోనే భారతదేశం వస్తారు. నాలుగుమాసాల్లోగా కాశ్మీర్ నుంచి పాకిస్తాన్ భారతసైన్యాల్ని ఉపసంహరింప చెయ్యడానికి ఉభయప్రభుత్వాలమధ్యనూ సమాధానం కుదిర్చి, ఉభయులకూ అంగీకారయోగ్యమైన కార్యక్రమాన్ని నిర్ణయించవలసిన బాధ్యత వీరిపైన ఉంది. నెహ్రూ - లియాఖత్ అలీఖాన్ ఒడంబడిక సాఫల్యమవడానికి పాకిస్తాన్ నాయకుల్లో వాస్తవంగా హృదయపరివర్తనం కలిగిందో లేదో కనిపెట్టడానికి కాశ్మీరంలో సైనికోపసంహరణవిషయంలో పాకిస్తాన్ ప్రభుత్వం వహించే వైఖరే ఆధారమవుతుంది.

[సూర్యనారాయణ]

వారిని ప్రభుత్వం నేరస్థులుగా పరిగణిస్తుం దనీ హెచ్చరించారు

మనరాష్ట్రంలోమాత్రం ముఖ్యమంత్రి గారు, మిగతామంత్రులు, ప్రభుత్వోద్యోగులు ప్రజలే కమ్యూనిస్టుల్ని తన్నాలనీ, అవసరమైతే చంపాలనీ ప్రోత్సహిస్తున్నారు అంటే ప్రభుత్వం కమ్యూనిస్టుల్ని తా మణచలేకపోయా రని చెప్పకొంటున్నా రన్న మాట తమ అసమర్థతని కప్పిపుచ్చుకోడానికి ప్రజల్ని పిరికి పందలని అవహేళన చేస్తున్నారు అది కాకపోతే ప్రజలు సహకరించడం లేదు కాబట్టి కమ్యూనిస్టు దాడుల్ని పోలీసులు అరికట్టలేకపోతున్నా రంటున్నారు ఇంతవరకూ కమ్యూనిస్టుల్ని గురించి పోలీసులికి సమాచారం తెలుపుతున్న వారిలో కమ్యూనిస్టుల తుపాకులికి గురికాకుండా కాపాడుకుంటున్నవారు ఆట్టేమంది లేరు పోలీసులికి సమాచార మిచ్చినా పోలీసులు వారిని కాపాడలేకపోతున్నారు ఇంకా ఇలాగే సమాచారం తెలిపి చావాలని పోలీసు ఉద్యోగుల అభిప్రాయం కావచ్చును. కాని అంతటి త్యాగబుద్ధి ఇప్పుడు బహుకొద్దిమందికే ఉంది

ప్రజలకి ఆయుధాలిస్తామనికూడా ముఖ్యమంత్రి చెప్పారు ఇది ప్రజలు కమ్యూనిస్టుల మీదే ప్రయోగిస్తారో, కమ్యూనిస్టులు వీనిని లాక్కొని పోలీసులమీదే ప్రయోగిస్తారో, లేక ప్రజలు కమ్యూనిస్టులు కాకపోయినా తమ శత్రువుల్ని కమ్యూనిస్టులని తిట్టి వారిమీదైన ప్రయోగిస్తారో చెప్పడం కష్టం

కాంగ్రెస్ వలంటీర్ దళాలవారికే తుపాకులివ్వాలని కొందరంటున్నారు కాని ఇది ప్రజాస్వామ్యసిద్ధాంతాలకి విరుద్ధం కమ్యూనిస్టుల తుపాకులకు గురౌతున్నది వాస్తవానికి కాంగ్రెస్ వారు లొక్కరే కాదు ఇతరులనేకులు గురౌతున్నారు. గ్రామాల్లో శాంతిరక్షకదళాల్ని స్థాపించి, అందులో కాంగ్రెస్ వారిని మాత్రమే కాక అన్ని వర్గాలవారినీ చేర్చి, వారందరికీ సమానంగా ఆయుధాల ప్రయోగంలో తగు శిక్షణ నిచ్చి అప్పుడు వారికి ఆయుధాలిస్తే ప్రయోజనం ఉంటుంది శాంతి కాపాడ్డం కాంగ్రెస్ వారి దొక్కరిదే బాధ్యత కాదు

అసలు దేశంలో కొద్దిమందికమ్యూనిస్టులు ఇంత అశాంతినీ, ప్రజల్లో ఇంత భీతినీ రెచ్చగొట్టగలుగుతున్నా రంటే లోపం దేశార్థిక స్థితిలోనూ సాంఘిక స్థితిలోనూ ఉంది. పేదప్రజల్లో దైవభీతి, పాపభీతి క్రమంగా సన్నగిల్లుతున్నాయి. దురంతాలకు వెనుదీసే మానవత్వం, దాక్షిణ్యం వారిలో క్షీణిస్తోంది. ప్రత్యక్షంగా వర్తకులు వ్యాపారులు, రాజకీయనాయకులు అపారలాభాలార్జిస్తుండగా, ప్రజల కష్టనిష్ఠురాలతోగాని న్యాయాన్యాయాలతోగాని నిమిత్తం లేకుండా అనేకులు అధికారుల ప్రాపకం ద్వారా, పర్మిట్ల అమ్మకాలద్వారా, బ్లాక్ మార్కెట్ ద్వారా అన్యాయధనార్జన చేస్తున్నప్పుడు శిక్షించకుండా ఊరకున్న దేవుడంటేనూ, కాంగ్రెస్ పరపతి అంటేనూ విశ్వాసం సన్నగిలిపోవడం సహజమే. వ్యాపారులు ప్రజల అవసరాన్ని కనిపెట్టి పీడించి ధనార్జనచేసి మేడలు కట్టి భోగాలనుభవిస్తుండగా, కిరసనాయిలు, బియ్యం వగైరా కనీసావసరాలైనా డబ్బిచ్చినా తీరకపోయే సరికి సామాన్య ప్రజల్లో అమానుషలక్షణాలు బలీయం కావడం సహజమే. ప్రభుత్వం అవినీతిపరులైన వ్యాపారుల్ని అరికట్టలేక వారిచేతికి లొంగిపోయిందనే భావం వ్యాపించిపోయింది. ఈ వాతావరణాన్ని మార్చి ప్రజల్లో తిరిగి ప్రభుత్వం పట్ల విశ్వాసం కలిగితేగాని కమ్యూనిస్టుల ప్రచారానికి వారు లొంగకుండా ఉండలేరు.

ముఖ్యంగా హరిజన వాడల్లో కమ్యూనిస్టుల ప్రభావం తొలగిపోవాలంటే ప్రభుత్వం వ్యాపారుల అవినీతిని అణిచి పేదలికి ఆర్థిక యాతనలనుంచి ముక్తిని స్తేగాని అసంతృప్తి, అశాంతీ నిర్మూలం కావు.

కేవలం కేంద్రప్రభుత్వం పోలీసుశాఖా నిర్వహణని స్వాధీనం చేసుకున్నంతమాత్రాన అశాంతి అణగదు. అయితే తాత్కాలికంగా అది అవసరం కావచ్చును.

హైదరాబాద్ లో కమ్యూనిస్టుల అరాచకచర్యల్ని అణచలేకపోయినా రన్న సత్యాన్ని అధికారులు అంగీకరించక తప్పింది కాదు. అయినా అక్కడ ప్రజాప్రాతినిధ్య పరిపాలన స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వం తటపటాయిస్తోంది. ఎన్నికలు జరపడానికి అక్టో. కాలం వెనుదియ్యలేరు. ఇప్పు డేదో తమకి నచ్చిన నలుగురుసంస్థాన కాంగ్రెస్ నాయకుల్ని మంత్రులుగా నియమించినంతమాత్రాన పరిస్థితి చక్కబడే వీలు కనబడదు. ఇటీవల వరంగల్ జిల్లా కాంగ్రెస్ ప్రతినిధుల సమావేశం ఈ అభిప్రాయాన్నే ప్రకటించింది. తెలంగాణాలో కమ్యూనిస్టుల్ని అధికారులు అణచలేకపోతున్నారనీ, అనవసరంగా కాంగ్రెస్ వారల్ని బాధిస్తున్నారనీ ఆసమావేశం ఆరోపిస్తున్నది. కేంద్రనాయకులు ఈచిన్నవిషయాల్ని అశ్రద్ధచెయ్యకుండా పరిశీలించినప్పుడే కమ్యూనిస్టుసమస్యను పరిష్కరించడానికి సాధ్యపడుతుంది. ప్రజలు సహకరించడం లేదని నిందించడం వల్ల ప్రజల్లో ప్రభుత్వం తమను రక్షించలేదనే అభిప్రాయం బలపడుతుంది కాని వేరే ప్రయోజనం ఉండదు. [సీతారామ్



జీలుగుమిల్లి గ్రామరక్షకదళం ముఖ్యమంత్రిగారికి సాయుధవందనం సమర్పించిన దృశ్యం

# రమణ మహర్షి

"రమణ మహర్షి"కి ఆ నామకరణము చేసినది అఖండప్రజ్ఞావంతుడును ఆంధ్ర పండితోత్తముడు నగు కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు. సుమారు 1907 సం॥లో కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు చేసిన నామకరణమే చిరాంకురమై ఆ మహర్షికి జగత్ప్రసిద్ధ నామధేయమైనది. వీరి తలిదండ్రులు వీరికి బెట్టినపేరు వెంకటరామన్. 1879 సం॥ డిసెంబరు 30 తేదీని ధనుర్మాసంలో వీరు జన్మించిరి. అప్పట్లో మధురజిల్లాలో చేరి యుండినట్టియు యిప్పుడు రామనాథపురం జిల్లాలో చేరియుండినట్టియు తిరుచ్చుళి అనే గ్రామం వీరి జన్మస్థానం. తిరుచ్చుళి అనే అరవ మాటకు "ఓంకారము" అని అర్థము. ఇది విరుదు నగరు రైల్వేస్టేషనుకు 18 మైళ్లదూరములో నున్నది. వీరి తండ్రిపేరు సుందర మయ్యరు, తల్లిపేరు అలగమ్మ. ఈ అరవమాటకు సుందరమ్మ అని అర్థము.

తండ్రి న్యాయవాదిగ పనిచేయుచు జీవితమును గడపుచుండెవాడు. ఈ కుటుంబము యొక్క పూర్వీకులలో నొకరి యింటికి ఒకనాడొక సన్యాసి అన్నార్తుడై వెళ్లెనట. కాని, ఆ సన్యాసికి భిక్ష పెట్టనందున "ఈ కుటుంబములో తరమున కొకరు, సన్యాసమును స్వీకరించి భిక్షాటనము చేయుచుందురుగాక!" అని శపించెనట. ఆనాటినుండియు యీ కుటుంబమున తరమున కొకరు సన్యాసస్వీకారము చేయుచుండిరి. సుందరయ్యరుగారి తండ్రుల వరకు సలో నొకరు సన్యసించిరి. సుందరయ్యరుగారి అన్న వెంకటేశయ్యరు ఆశ్రమ స్వీకార మొనర్చిరి. సుందరమయ్యరుగారి కుమారులలో 2 వ కుమారుడైన వెంకటరామన్ కూడా సర్వసంగపరిత్యాగి యయ్యెను. ఆ సన్యాసిశాపమే లోకమునకు వరప్రసాదమై శ్రీ రమణమహర్షిని మనకు సంప్రాప్తింపజేసెను.

వెంకటరామన్ మంచి దృఢకాయుడు. కుస్తీలు, దండెములు, బస్కీలు చేసిన వస్తాదు. ఆటలలో అందెవేసిన చెయ్యి. బాల్యములో శరీరమును యెటువంటి వ్యాయామసాధనలచే యీ బ్రాహ్మణ బాలుడు వశపరచుకొనగలిగెనో, అంతకంటె మించిన సూక్ష్మసాధనలచే తన బుద్ధీంద్రియములను వశపరచుకొని "అహం బ్రహ్మ" యను ఆత్మసాక్షాత్కారమును పొందగలిగెను. రమణమహర్షి బాల్యదశలో ఒడలుమరచి నిద్రపోవుట కలదు. ఒకనాడు 1891 సం॥లో దిండిగలునందు ఇంటిలోనివారందరు దేవాలయమునకు పోయిరి. వెంకటరామన్ మాత్రము గదితలుపు గడియవేసికొని నిద్రపోవుచుండెను. ఇంటివారు గుడినుంచి తిరిగి వచ్చి ఎంతసేపు తలుపులు కొట్టినను వెంకటరామన్ నిద్ర లేవలేదు. వారుగోడలెక్కి గదిలోనికి జొరబడిఎంతమంది ఆయనను అటు యిటు కదలించినను నిద్రలేవలేదు. తరవాత కొంతసేపటికి ఆయనే యనిద్రలేచెను. ఆయననొక కొంటె కుర్రవాడు యనమీదనున్న కోపంచేత ఆయన నిద్రపోవుచుండగా ఎత్తుకొనిపోయి ఆ నిద్రలోనే ఆయనను బాగా ఆ మర్దించి తిరిగి ఆ నిద్రలోనే ఆయనను మంచంమీదఘట్టి వెళ్ళెనట. అది కుంభకర్ణుని నిద్రవలె అందరికీ కన్పించేది. కాని, అది రమణమహర్షికి బాల్యములో అంకురించిన యోగనిద్ర యనియు సమాధి తుల్యమైన స్థితి అనియు మరి కొందరు అన్వయించిరి.



మొత్తముమీద బాల్యదశను పరిశీలించి చూడగా వీరికి లౌకికవిద్యయందు ఆసక్తి ఉండెడిదికాదు. 1895 సం॥లో నవంబరు మాసమందు ఒక బంధువు వీరింటికి వచ్చి తాను తిరువన్నామలై అనబడు అరుణాచల క్షేత్రమును సందర్శించి వచ్చుచున్నానని వెంకటరామన్‌తో చెప్పెను. ఆబంధువు ఆ క్షేత్రనామమును ఉచ్చరించినమాత్రము

(34-వ పేజీ చూడుడు)

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

౨౬-౨

ఆ సమయముననే పల్లవపాండ్యులు కాళింగులతో గూడ మంతనములు చేసిరి. కాళింగులకు అనాదిగా మంచి నౌకాబలము కలదు. వారి నౌకాబలము పల్లవపాండ్యులు సేకరించిన చోళమండలనౌకాబలములతో గోదావరీముఖద్వారమున కలసికొనుటకును, ఆ బలములతోపాటు ఉభయుల భూసైన్యములును ద్రాక్షారామభీమేశ్వరమున గలసికొనుటకును వారు నిర్ణయించుకొనిరి. ఈ విధమున సముద్రతీరమంతయు కాకతీయుల పాలనమునుండి తప్పింపవలెనని వారల యూహ! ఆపిమ్మట స్థితిగతులను బట్టి కర్తవ్యమాలోచించుకొనవచ్చునని వారు నిర్ధారణ చేసిరి. కాళింగులు పల్లవపాండ్యుల దోపిడిమూకలసాయముతో నా భూభాగము తామే ఆక్రమింపవచ్చు ననియు, పల్లవపాండ్యులు దోపిడిచేసినయనంతర మందు ఉండబోరనియు తలంచిరి. పల్లవపాండ్యులకు జిగీషయు ధనాశయునే గాని వేరు చింతలు లేవు.

జటావర్మసుందరపాండ్యుడు తన సేనలతో నెల్లూరనే నిలిచి కొప్పెరుంజింగని మహాసైన్యములతో ద్రాక్షారామమువరకు దండు సాగింప బంపెను. అంతలో ఏకశిలానగరవార్తలు వారికి శీఘ్రముగా తెలియవచ్చెను. 'ఇప్పు డొక యబల కాకతీయసింహాసన మధిష్ఠించినది! ఆమెభర్తయు పలువురు బలవంతు లగు సామంతులును ఆమెను ప్రతిఘటించుచున్నారు.' ఇది తెలిసిననెంటనే అందరకు ఏకశిలానగరమునే ముట్టడింపగల మను ధైర్యము కలిగినది.

నెల్లూరునుండి బయలుదేరిన కొప్పెరుంజింగడు రణనీతివిశారదుడు. ఎక్కువ ప్రతిష్టంభనము రాదని యాతడు తలంచినమార్గముననే తన దండు సాగించెను. అతడు ముందుకు సాగుచున్నకొలదియు నౌకాసేనలు గూడ ముందుకు సాగుచుండెను. వారు నెల్లూరునుండి కొంతదవ్వు ఉత్తరముగా ప్రయాణము సాగించిరి. ఆపిమ్మట సముద్రతీరము తూర్పుకు తిరుగును. అందుచే నా సేనలును తూర్పునకే తిరిగెను.

ముం దాతడు కందుకూరు చేరెను. అంతట మోటుపల్లిలో తన కిష్టు డగు సిద్ధయదేవచోడుని వదలి, యాతడు వెలనాటికి రాజధాని యగు సనదవోలు అను నామాంతరము గల ధనదుప్రోలికి వచ్చెను. అక్కడి చోళప్రభువు పూర్వనిర్ణీతసంకేతము ననుసరించి కొప్పెరుంజింగని సేనలు వచ్చినంతనే వశ మయ్యెను. పిమ్మట శీఘ్రముగా నాతడు తన సేనలు రెండుగా జీల్చి, గొంటూరి నాగదేవుని మండలము పరిహరించి, కృష్ణానదిని కొల్లూరునొద్ద నొక సేనయు ఎల్లటూరువద్ద రెండవసేనయు నుత్తరింప నాజ్ఞాపించెను.

ఆ రెండుదళములు నట్లు కృష్ణను దాటి విజయవాటికను కొలనివీడుమార్గమును, అక్కడ బలమైన సేన లుండు నని పరిహరించి మోసలపట్టణముపై కేగెను. రెండువైపులనుండి ఈరెండు వాహినులే కాక సముద్రమునుండి నౌకాబలముకూడ వచ్చి మోసలపురమును ముట్టడించెను. దానికి తాళజాలక అచ్చటి నావధ్యక్షుడు పలాయితుడై కొలనివీడు చేరుకొనెను. మోసలపురము పల్లవరాజుకు హస్తగత మయ్యెను.

కొప్పెరుంజింగ డంత తన పల్లవసేనలతో సంపన్న మగు నా భూభాగమును దోచుకొనుచు గోదావరీముఖద్వారమువైపునకు తన సేనల గదలించుచుండెను.

సరిగా నిట్టిసమయమున కాకతీయసేనాను లగు కొలనిరుద్రుడొకవైపునను జన్నిగదేవుడు త్రిపురాంతకుడు మరియొకవైపునను మహాసేనలతో, నీ బహిశ్శత్రువులను, అంతరశత్రువులను అడచు ప్రయత్నముతో బయలుదేడలిరి. అంబదేవుడును అన్నమంత్రియు నింకను రాజధానీనగరముననే ఉండిరిగదా!

ఆ ముగ్గురుసేనానులును తమలోతామును ఇతర కాకతీయసేనానులతోడను రుద్రదేవమహారాజుతోడను సంప్రదించియోంబయులు దేరియుండిరి. కొలనిరుద్రుడు కొలనివీడు చేరి యా చుట్టుపట్టుల గల దుర్గముల నన్నిటిని బలపరచి యటువైపులకు కొప్పెరుంజింగని కాడవసేనలు రాకుండ నరికట్టవలెను. అంతియే కాదు. తూర్పునుండి వచ్చుచున్న కాళింగబలములనుగూడ గోదావరిదరికి రాకుండ నాతడు అడ్డగింపవలెను. ఈవిధముగా నాతడు కాళింగకాడవసేనలు జోడు కాకుండా చీల్పవలెను.

కాని యది చాలదు. అత డిట్లు వారల భూసైన్యములు ఏకము కాకుండ జేసినను, కాళింగకాడవనౌకాబలములు కలసినచో కాకతీయసేనానుల శ్రమ యంతయు వృథ యగును. అందుచే దానితోపాటు వారి నౌకాసేనలకుకూడ చీకాకు కలిగింపవలెను. కోరంగి మొదలు గోదావరీముఖద్వారమున నున్న కాకతీయనౌకాబలములకు ధైర్యము కలిగించి వానికి ఆ యుభయబలముల నెదిరించు శక్తి చేకూర్పవలెను. మోసలపట్టణమును మోటుపల్లియు శత్రువుల స్వాధీ

నమున నే యున్నచో నది సాధ్యము కాదు. ఆ రెండు రేవులలో నొక్కటియైనను కాకతీయసేనానులు మరల వశము చేసికొనవలెను. అట్లు చేసినచో పల్లవపాండ్యబలములు బలహీన మగును; కాకతీయ బలములకు జయము సులభసాధ్య మగును.

ముందు పట్టవలసినది మోసలపురియా, మోటుపల్లియా? ఏదియైనను ఈ సాహసకార్యమునకు పూనుకొనగలుగున దెవరు? అది సాధించుదారి ఏది?

అప్పటికే కొప్పెరుంజింగని కాడవసేనలు కృష్ణానదియుత్తర తీరమునకు దాటియున్నందున అందు గల మోసలపురిని పట్టుట కంటె కృష్ణానదికి దక్షిణమున నున్న మోటుపల్లి పట్టుట సుఖతరము. అందును మోటుపల్లి వేలానగరము మిక్కిలి గొప్పది. మోటుపల్లి చేజిక్కించుకొనినవారిదే ఆంధ్రసముద్రతీరప్రభుత్వము! అందుచే మోటుపల్లిపై దండెత్తుటకే వారు తుదకు నిశ్చయించిరి.

ఈ సాహసకార్యమునకు త్రిపురాంతకుడు పూనుకొనెను. వారి కుటుంబములో గంగయసాహిణి నాటినుండియే బ్రహ్మరాక్షస బిరుదము కలదు. రక్కసగంగనితరువాత త్రిపురాంతకునికే ఈ రాక్షసబిరుదము వచ్చినది. రాక్షసైకసాధ్య మగు ఈ మహాకార్యము త్రిపురాంతకునిపైననే పడినది.

త్రిపురాంతకు డీ దుష్కరచర్య కుపక్రమింపబోవుముందు అతడు తన సోదరు డగు జన్నిగదేవునితో కలసి శ్రీశైలము చేరి యచ్చట మల్లికార్జునస్వామిని భ్రమరాంభను సేవించి వెనుకటి మ్రొక్కులు తీర్చుకొని మరల క్రొత్త మ్రొక్కులు మ్రొక్కుకొనెను. భ్రమరాంబామల్లికార్జునుల ప్రసాదము వడసి యాతడు ప్రచండసైన్యములతో బయలువెడలెను

జన్నిగదేవుడు నెల్లూరినుండి పాండ్యసేనలు బయలుదేరినచో వానిని నిరోధించుటకు మాత్రమే సిద్ధముగా నుండెను. అత డిప్పుడు ముందుగా నెట్టి పోరునకును తానుగా దిగకుండునట్లు నిర్ణయము చేసికొనెను.

త్రిపురాంతకుడు మోటుపల్లిపై బడుటకు అద్దంకిమీదుగా ప్రయాణ మయ్యెను. అద్దంకిలో కాకతీయులకు సారంగు డను మహారాష్ట్రసామంతు డొక డుండెను. అతనికిని నెల్లూరుచోడుల కును విరోధము. పూర్వ మీ సారంగునికిని మనుమసిద్ధికిని పోరు కలిగెను. అందులో మనుమసిద్ధిసేనలు జయించెను.

"శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మెలుకోదవించుకయు మహారాష్ట్రసామంతు సా
రంగుం దోలి తురంగముం గొనిన సంగ్రామంబుకం దృప్త స
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపంపై నున్న సైన్యంబులన్."

తెలుగుచోడులు పలువురు పాండ్యపల్లవులతో మైత్రి నెరపినందున, ఈ మహారాష్ట్రసామంతుడు కాకతీయప్రభువులకు నమ్మిన బంటుగా నుండెను. అందుచే త్రిపురాంతకుడు అద్దంకిమండలము మీదుగా మెరపువెరసినట్లే మోటుపల్లిపై బడెను.

పూర్వనిర్ణీత మగు సంకేతముప్రకారము గోదావరిముఖద్వారము నుండి కాకతీయనౌకాసేన యొకటి త్రిపురాంతకుడు మోటుపల్లి చేరునాటి క్రిందటిరాత్రికే అక్కడికి చేరి యా రేవును ముట్టడించెను.

అప్పుడు మోటుపల్లిలో నెట్టి యుద్ధప్రయత్నమును లేదు. ఆవల నెల్లూర పాండ్యసేన లున్నవి. ఇటు కొప్పెరుంజింగడు నిరాటంకముగా గోదావరివైపునకు సాగిపోవుచుండెను. ఓరుగల్లులో అబల సింహాసన మెక్కినది. మరి భయ మేమి? సిద్ధయదేవచోడ డందుచే నిర్భయముగా ప్రమత్తుడై యుండెను. అతని సేనలుగూడ క్రమశిక్షణ లేక దోపిడిమూకలై పోయినవి. చోరమండలములోని నావికుల దుర్వృత్తులు మోటుపల్లికి గూడ ప్రాకినవి.

మోటుపల్లిలోనివారు తెల్లవారి చూచునప్పటికి దూరమున వరాహధ్వజములు గాలికి ఉత్సాహముతో నాడుచుండ కాకతీయ నౌకలు తెరచాప లెత్తి దివ్యవిహంగములవలె నడయాడుచు కనిపించెను. వాయువుగూడ ముట్టడించిన యా నావలకు అనుకూలముగను, రేవులోని నావలకు వ్యతిరేకముగను ఉన్నది.

మోటుపల్లి రేవులోని నావికులు తత్తరముతో తమ నావలు సిద్ధము చేయసాగిరి. కాని యీమధ్య ఆ నావలలోని నావికులును సైనికులును దోపిడికిని భోగములకును అలవాటుపడియున్నందున, వారు తమ నిర్ణీతస్థానములు వదలి దూరస్థలముల కేగియుండిరి. వారిలో కొందరు పానశాలలలోనను, కొందరు యవనభోగగృహములందును తాము అన్యాయముగా సంపాదించిన ద్రవ్యము వెచ్చించుచుండిరి. అందుచే కొన్ని నావలకు పనివారు లేరు. ఒక నావకు కూపకస్తంభమే కనబడదు. మరియొకదాని కది విరిగియేయుండును. ఒకదాని తెడ్లు కనబడవు. మరియొకదానికి తెడ్లు దూర్చు మేకులు విరిగియుండును. అది బాగుచేయు దారుశిల్పులు కనబడరు. రేవులో ఇట్లు గందరగోళముగా నున్నది. దూరమున నడయాడుచున్న కాకతీయనౌకలు చేరువకు వచ్చుచున్నట్లుండెను. అంతకంతకు రేవులో అలజడి యెక్కు వయ్యెను. అచ్చట నున్న ఏబది నౌకలలో నొక్కటియు పోరుకు సిద్ధము కాలేకపోయెను.

ఆ సమయముననే సరిగా త్రిపురాంతకుని సేనలు మోటుపల్లి పట్టణకుడ్యములను ముట్టడించి భయంకరముగా రణదుందుభులు మ్రోయించెను. ఆ రణదుందుభులును 'త్రిపురాంతక, త్రిపురాంతక, త్రిపురాంతక' యని యాతని నామమును ఘోషించుచున్నట్లే విననయ్యెను. సేనల యట్టహాసములకంటె ఆ రణదుందుభిధ్వానములే తీవ్రతరముగా నుండెను. కోటలో నున్నవారికి గుండెలు దడదడలాడిపోయెను.

ఆ దుర్గమును దుర్గమువలెనే లేదు. కందకములలో నీరు సరిగా లేదు. కోటగోడలపై భటులు యథాస్థానములలో కాపు లేరు. ఉన్న కొలదిమందియు త్రాగి మత్తిల్లినవారును నిద్రించువారును నై యుండిరి. వరుసగా కొన్ని దినములుగా పట్టువడిన యలవాటులు ఒక్కనాటిలో పోవునా?

త్రిపురాంతకుని కాశ్చర్య మయ్యెను. అతనికి మోటుపల్లిలోని అశ్రద్ధ కొంతవరకు చారులవలన తెలిసియే యుండెను. కాని యాతడుగూడ నింత ప్రమత్తముగా నుండు నని యూహించి యుండలేదు. ఏమైన నేమి? అతని భటులను ప్రతిఘటించువారే లేరన్నట్లుండెను. అందుచే అపరాహ్ణమునకే మోటుపల్లికోటను త్రిపురాంతకుని సేన లాక్రమించెను. వెంటనే కోటపై నిశరధ్వజము లన్నియు విరుగగొట్టించి కాకతీయప్రభువుల వరాహధ్వజముల అంతకంటె కొంచెము క్రిందుగా తన ఖట్వాంగధ్వజమును త్రిపురాంతకుడు ఎత్తించెను.

సిద్ధయదేవచోడుడు తప్పించుకొని పారిపోవుటకు గూడ నవకాశము లేకపోయినది. కతిపయఘటికలలో త్రిపురాంతకుడే రాజభవన మెల్లెడల వెదకివెదకి సిద్ధయదేవచోడుని పట్టుకొని, కేశములు గ్రహించి నేలకు దిగలాగి, శిరస్సుపై కాలూని భయంకరమూర్తియై యాతని తల తెగనరకెను. వెంటనే త్రిపురాంతకుని యాజ్ఞలు పాలించి సైనికులు రక్తమోడుచున్న సిద్ధయదేవచోడుని శిరస్సును మొండెమును రెండిటిని రెండు పొడుగుపాటి శూలములకు గ్రుచ్చి, వేలానగరము గోపురద్వారమునకు ఇరుప్రక్కల నెత్తుగా నిలిపిరి. అది చూచి వేలానగరములోని సేనలు గూడ భయభ్రాంతులై లొంగిపోయెను.

గోదావరీముఖద్వారమునుండి వచ్చిన కాకతీయనౌకలు ముప్పదియే! మోటుపల్లి వేలానగరమున ఏబదినౌకలు కలవు. అందుచే కాకతీయనౌకలకు వేలానగరములోని నౌకలను జయింపగల శక్తి లేదు. అవి బెదరించి త్రిపురాంతకుని ముట్టడికి సాయముచేయుటకు మాత్రమే ఉద్దేశింపబడినవి. అవి స్వయముగా పోరుటకు కవియుట లేదు. వేలానగరములోని నౌకలు తీవ్రముగా విజృంభించినచో నవి పారిపోవుటకు తగు ప్రయత్నముననే యుండెను.

కాని యిప్పటి స్థితిగతులు మారిపోయినవి. ఆకస్మికముగా వరాహధ్వజము కోటపై ఖట్వాంగధ్వజముతోపాటు గాలికి ఉత్సాహముతో నాడుచున్నది. కాకతీయనౌకలకు రమ్మని సంజ్ఞలు కోట నుండి స్పష్టముగా సంకేతితమార్గమున కానవచ్చెను. కాకతీయ నౌకలకు వాయు వింకను అనుకూలముగనే వీచుచున్నది. పోటు కూడ ప్రారంభించినది. ఉత్సాహముతో నా నౌకలొక్క పరుగున వేలానగరములోని ఉప్పుటేరులో జొరబడెను. అక్కడ నున్న ఏబదినౌకలును ఎదురాడకుండ కాకతీయనౌకలకు స్వాధీన మయ్యెను. త్రిపురాంతకుని రాక్షససాహసము ఫలించెను.

వెంటనే అతడు మోటుపల్లి పట్టుకొన్నవార్త శ్రీరుద్రదేవ మహారాజునకును జన్నిగదేవునకును అంచెలమీద వేగులచే తెలియజేసెను. కోటలో నామమాత్రముగనే అతడు విజయోత్సవము జేసెను. మోటుపల్లి స్థితి అయోమయముగా నున్నది. పాండ్యసేనలు గాని కాడవసేనలు గాని ఎప్పుడైన రావచ్చును. చుట్టుప్రక్కల నున్న మాండలికు లెవ్వరైనను దండెత్తవచ్చును. చోరనావికుల నావలును ఊరకొనునా? వేలానగరమును మోటుపల్లి దగ్గరను ఎట్టి శత్రువులనైన నెదుర్కొనగలుగు సన్నాహము లొనర్పవలసి యున్నది. అవసరమైన చర్యలు అతడు కఠినముగా తీసికొని, స్వయముగా నచ్చటి స్థలదుర్గమును జలదుర్గమును బలపరచెను. సైనికులును నావికులును రాత్రింబవళ్లు జాగరూకులై వేయికళ్ళతో జలమార్గములను భూమార్గములను గాచుచుండిరి. వేలానగరమున గణపతిదేవుల యభయశాసనము పునఃప్రతిష్ఠిత మయ్యెను. త్రిపురాంతకు డామండలమునం దల్లరి నలజడుల లేకుండ శీఘ్రముగా నిరోధించెను.

ఇకముం దాతడు చేయవలసిన పని నిశ్చితము కాలేదు. జన్నిగదేవుడు ముందు పాండ్యసేనల నెదుర్కొనుటా, కొప్పెరుంజింగని వెన్నాడుటా, నిర్ణయింపలేకుండెను. అంబదేవుడు రాజధాని నుండి మహాసేనతో ఇంకను రావలసియుండెను. కొలనికుడు కాళింగసేనల నెంతవరకు ప్రతిఘటింపగలడు? వానిపైన త్రిపురాంతకుని భావిచర్య లాధారపడియుండును.

కాకతీయసైన్యములు నిశ్చయముగా దాటిపోయి మోటుపల్లి పట్టుకొనిన వార్త మొగపుమొగసినట్లు తీరభూముల నెల్లెడ ప్రాకిపోయెను. అది విన్నవారు ముందు నమ్మలేకపోయిరి. మరలమరల నా వార్తయే వచ్చి స్థిరపడినపిమ్మట అక్కడి నాగరికులును జానపదులును బ్రదికితిమని నిట్టూర్పులు విడిచిరి.

ఈవిధముగా రుద్రదేవమహారాజునొద్ద ఆమె సేనానాయకులు విజయదశమినాడు కైకొన్న ప్రతిజ్ఞలలో నెల్ల ముందుగా త్రిపురాంతకుడే తన ప్రతిన అక్షరశః సిద్ధయదేవచోడుని తల నరకి పాలించెను. అతడు మహారాజునకు పంపిన విజయపత్రముతోపాటు, ఆనాడు తనకు వచ్చిన జమ్మిపత్రమును, సూత్రముతో కట్టిన సిద్ధయదేవనామాంకితపట్టమును గూడ పంపుట మరవలేదు.



గుంటూరు జిల్లా మోపర్రులో ప్రసూత చికిత్సాశాలను గా॥ బి. రామకృష్ణరాజుగారు తెరచిన దృశ్యం. వారిప్రక్కన మంత్రి చంద్రమౌళిగారు, పట్టిమాలు [illegible] స్థానికోద్యోగులు నిలిచియున్నారు.

# శాసనం

**"సావేరి"**

[అంకితం: అగస్టు నలభైరెండు]

[అక్కడో అందమైన ఫొటో వుంది. అక్కడో అందమైన పుస్తకం వుంది. 'ఎవరిదా ఫొటో' స్నేహితుడు అడిగాడు. వినిపించుకోలేదు నేను. 'ఎంత అందంగా వున్నాడు.' 'ఎవరిదయ్యా ఆ ఫొటో!' గట్టిగా నిక్కచ్చిగా అడిగాడు. అట్లా అడుగు మరి! వీడు మాటలకి లొంగే ఘటమా, అట్లా అడుగు. చెప్పడానికి నాకు యిష్టం లేదు. వాడికి మూర్ఛవస్తుంది అప్పుడప్పుడు. వాడికి వస్తే పిచ్చిఆసుపత్రికి నేను కూడా వెళ్లాలి. చచ్చేరోజునకూడా వీడు నన్ను వదిలేట్టు లేడు. వీడి నాన్నావాళ్లు వీడిమీద పెత్తనం నామీద పెట్టారు. నియోగింపబడటం.

అతను చేత్తో నా భుజంమీద తట్టి, 'చెప్పరూ, నీకు పుణ్యం వుంటుంది.' 'అబ్బే, ఇందులో చెప్పడాని కేముంది?' 'ఏమిటి కథ' సుధారావు సిగిరెట్టు ముందు పరిచాడు. 'ఏం చచ్చిపోయాడు కదూ!' బల్లమీద వేళ్లుపరచి విస్తుపోయాను. 'నీ కెలా తెలుసు' 'అంత అందమైనవాళ్లు బ్రతకడం అరుదు' 'ఆగస్టు నలభైరెండులో' 'ఎవరతన.' 'కాల్చి చంపారు.' 'కాంగ్రేసా?' 'కాదు. బాంకిగుమాస్తా' 'దగ్గిరిబంధువా' 'ఔను' 'ఇంకా?' చెప్పడానికి నోరు రాలేదు. 'నీ ఆరోగ్యంఅంత మంచిదికాదు. నీ విషయం నీకు తెలీదు!' 'అబ్బ, చెప్పవోయ్, చంపక?' 'కావాలంటే ఆ పుస్తకం చదువు - తెలుస్తుంది.' సుధారావు పుస్తకం విప్పాడు.]

౧

విశ్వాసరావు నాలుగు అయిదు అశ్వాసాలమీద ఎక్కివస్తాడు. చిన్నతనంలో తల్లిచేతుల్లో పెద్దవాడై, భార్యచేతుల్లో ఇప్పుడు - అప్పుడే పుట్టిన పాపాయివలె. బాంకీగుమాస్తావలె. భర్తృహరిశతకం వలె బ్రతికినవాడు విశ్వాసరావు.

తనేమిటో తనపనేమిటో అంతవరకే గాని ఇతర్ల సంగతి పట్టించుకొనేవాడు కాదు. ఆట్టే ఇతర్లు ఏమైపోయినా తనకి ఇబ్బందీ బాదరబందీ లేదు. చింత లేదు. ఆట్టే ఇతర్ల వేపు కన్నెత్తి చూసేవాడు కాదు. ప్రపంచమంతా ఒకరీతిన పోతూంది. విశ్వాసరావు ఒకరీతిన పోతున్నాడు.

విశ్వాసరావుకి తనమీద విశ్వాసం ఎక్కువ. తను చేసే ప్రతిపనిలోనూ నడిచే ప్రతిరీతిలోను తనకి విశ్వాసం ఎక్కువ. తనమీద తనకి అభిమానం, నమ్మకం, ఆయుర్దాయం, ఐశ్వర్యం, సకలం అభివృద్ధిరస్తు!

తనకంటే తెలివిగలవాడు లేడనుకోడంలో కొంత అర్థం వుంది. అట్లా అనుకోకుండా ఈ భూమ్మీద బ్రతకడం ఎంత దుస్సాధ్యమో నీకు ఇంకా తెలియకపోవచ్చు. అతను ఎప్పుడూ నవ్వుతూంటాడు. స్నేలుడు నాలుగు అందాలా చేటు. అతనికి శత్రువు ల్లేరు. శ్రీమంతు ల్లేరు. కోపం లేదు. కీడు లేదు. ఏవగింపు ల్లేవు. ఏతావాతా ల్లేవు. వ్యాజ్యాలు, గోడతగాయిదాలు: రాతకోతలు, దస్కత్తులు, లావాదేవీలు - మంచితనం - కొట్లాటలు, కనీసం కోర్టుకచేరీలు, కనీసం పోట్లాటలు .. మంచితనం - ఇవేవీ లేవు. అంతా మంచితనం. ఏమీ ఎరక్కపోవడం మంచితనం. మంచినీళ్ళ సముద్రం వలె.

'విశ్వాసరావు మారిపోయాడు' అన్నారు. 'ఎంచేత' అన్నారు.

'దేన్నైనా చేరదీశాడా?' 'ఊహు, అట్లాంటి దేమీ లేదు.' "మరి?'

'ఏమో, ఎవరికి తెలుసు!'

మనిషిమనస్సు మారింది. రూపు మారింది. ఇంతగా నల్లబడ్డాడు.

'ఏమిటి సంగతి' అడిగారు. అతను తప్పుకొని తనదోవన పోయాడు. వంటిమీద శాలువా తలమీదకి లాక్కొని తనలో ఏదో గొణుక్కుంటూ పోయాడు. 'వీడికి భూతం పట్టింది.' 'సంసారంసంగతి పట్టించుకోడేం.' వీడికి పోయేకాలం వచ్చింది.'

రూపం మనస్సులాంటిది. చంచలత. వటవృక్షం మనస్సుని అలుముకొంటున్నది.

సమయం: క్రీస్తుపూర్వంనుంచీ జరిగే కిరణసంయోగక్రియ బాల్చీవంటి బాంకీలో - జీవితంలో కాలక్షావంతు అరగదీసుకున్నాడు. బాంకు భేతాళం రంగరించి దోసిళ్లు పట్టింది. ఏవేళ ఎట్లాంటిదో ఎవరికీ తెలియదు. తెలిసిరాదు. అంతా కీడు మూషనంతవరకు, తన చాపకిందకి నీళ్లు రానంతవరకు, వారకాంతాసమేతంగా ఈ ధనకనకవస్తువాహనప్రపంచ మంతా సజావుగా సాఫీగా సుభ్రతగా సభ్యతగా సబబుగా బేషరతుగా సందడిగా సఖ్యతగా సవ్యంగా సరసంగానే కన్పిస్తుంది వటపత్రసుందరి వలె. వినమితోత్తమాంగిని వలె.

విశ్వాసం వటవృక్షం లాంటిది.

విశ్వాసరావు సాయంకాలం బాంకు నుంచి ఇంటికి పోతున్నాడు 'ఆ'వలె. కోటు తొడుక్కోకుండా కుంఫీనీవాడి మోస్తరు భుజాలమీద కప్పుకొని వీధిమీద నిటారుగా నడిచేవాళ్లల్లో, సంఘంలో తల ఎత్తుకొని నిగుంఢంగా తిరిగేవాళ్లల్లో విశ్వాసరావు ఒకడు.

విశ్వాసరావు బాంకీ మేనేజర్ అవుతాడు. ఒక్కొక్క-స్వప్నాన్నే తీరిగ్గా ఇన్నాళ్లూ ధరించాడు. ఇన్నాళ్లూ మాట పడలేదు. ఇవాళ బాంకీమేనేజర్ దుర్భాషల్ని దుర దృష్టాన్ని, దుష్టబుద్ధిని, వెరశి తీతువుపిట్టని జేబులో వేసుకొని ఇంటికి పోతున్నాడు రోలర్ వంటి రోడ్డు మీద నడచి తను,

బాంకు మేనేజరు కాదు, తెలుసుకున్నాడు. అతి సామాన్యుడు. అందరివలెనే - లోపలి వైపు కాగితంవలె కాలిపోతున్నది. ప్రపంచం నుసిరంగు.

ఎంతో దూరం నడచి వచ్చినవాడికి తోటి మానవుడు కనపడడు. తోటిమానవుడి ఆసరా కావాలి తనకి. మనిషి దేన్నీ ఆశించడం లేదా ఇప్పుడు. దేన్నీ ఆశించకుండానే బ్రతుకుతున్నాడా, ఇప్పుడు. మనిషి దేన్ని ఆశించి మరో మనిషి దగ్గరికి వస్తున్నాడు. మరోమనిషిని దగ్గరికి తీస్తున్నాడు. అలాంటి డేమీ ఈ మానవులకి అక్కర్లేదా ఇప్పుడు? [సెబాస్] ఏమయ్యారయ్యా వీళ్లంతా. అర్థం కాదు. విశ్వాసరావు కర్మఫలి వున్న సంగతే మరచిపోయాడా. అర్థం కాదు. పదానికి, పదార్థానికి, పదాంచితాలకి ఈ ప్రపంచానికి అర్థం లేదు! ఏమయ్యారయ్యా ఈ మానవు లంతా? తను అందరివలెనే ఒకడు. అందరిలో ఒకడు. గుంపులో తనూ ఒకడు! తనవలెనే జీవితశాఖలన్నిటూ చీలికలౌతున్న కళ్లతో, చిల్లులు పడే కాళ్ళతో రేబవళ్లు చాకిరీ చేస్తున్నవాళ్లు. అష్టనష్ట కష్టాలుపడేవాళ్లు. ఒక్కొక్క కష్టాన్నే గట్టెక్కుతూ వస్తున్నవాళ్లు. అందరూ కన్పిస్తారు. అందరివలెనే తనూ ఉన్నప్పుడు...చాలు, నాయనా, ఇకచాలు, విశ్వాసరావు తనని తెలుసుకున్నాడు. మానవుడు తోటిమానవుని.

అలసిపోయిన ఆలోచనలతో విశ్వాసరావు ఎనిమిదివలె తిరుగుతూ పోతున్నాడు ఇంటి వైపు. ఈరోజు గడవదని తెలుసుకుంటున్నాడు. కష్టపడే ప్రతిమనిషీ దేశానికి కొద్దో గొప్పో సేవ చేస్తున్నాడని తెలియజేయి.

## 2

ముష్టివాడి ఒళ్లు ముళ్లవలె గడ్డకడుతుంది. మూర్ఖవాడు ముచ్చెమటలు పోసేలా విలపిస్తున్నాడు. మన ప్రపంచంలోని పంచరంగుల్ని చెరిపేయడానికి, ఆగస్టు నలభైరెండు వచ్చింది. ఛిద్రమైన కలలతో, చితికిన కన్నులతో ఆగస్టు నలభైరెండు. ఈ వేళ తలమీద రక్తం గుమ్మరించుకుంది. ఇంట్లో కాంగ్రెసు. వీధిలో బ్రిటీషు.

బల్లలవంటి రాస్తామీద రోదలు లారీలు. గుంపులు జవాన్లు ఆడవాళ్లు వివస్త్రధారిణులు వివస్త్రధారిణుల కడుపులో పసిబిడ్డలు సొల్లా చదురై కాళ్లకిందపడి బూట్లకిందపడి కటకట నలుగుతున్న పసిబిడ్డలు తల్లులు, తమ్ములు, అక్కలు, చెల్లెళ్లు, అన్నలు, తండ్రులు.

విశ్వాసరావు గాభరాగా హోటల్ వలుపులోకి వళ్లాడు. అసిచటునపడి వడిగా పరిగెత్తాడు.

ఖడ్గమృగాలు చెవులు రిక్కించాయి. 'ఊ!'-ఆజ్ఞలు పాటించాయి. తీతుపుపిట్టలు విధ్వంసనంగీతం ప్రారంభించాయి. 'ఊ!'-ఆజ్ఞలు. క్లిక్, క్లిక్, క్లి-క్, క్రీక్చ్చ్చ్... పట్టుతప్పిన జల్లులవలె నేలకొరుగుతున్న మానవులు, నీటిమొక్కలవలె, చెట్లవలె నేలకొరుగుతున్న మానవులు, అక్కలూ, తమ్ములు, అన్నలూ అవమానాలూ నేల కొరుగుతున్న మానవులు పిండి బొమ్మలవలె.



విశ్వాసరావు చనిపోయాడు. ఎందుకు? ఎవరికీ తెలియకుండా విశ్వాసరావు చనిపోయాడు. పంథొమ్మిది వందల నలభైరెండో యేట. విశ్వాసరావు బాంకీ గుమాస్తా విశ్వాసరావు ఒక బిడ్డ. తండ్రి. విశ్వాసరావు చనిపోయాడు. విశ్వాసరావు లోని తెల్లగుర్రం వెళ్లివచ్చింది. వెలుపలికి ఎవరికీ తెలియదు.

తెల్లచీమలు చచ్చిన బల్లుల్ని కాల్వల్లో పూడ్చేసేందుకు ప్రయత్నం. చనిపోయిన తెల్లగుర్రాల్ని పచ్చటి కాపురాల్ని క్రౌంచపక్షుల కన్నెరికాన్ని విడతీయడం ప్రయత్నం.

రాస్తా ప్రక్క పూడుకుపోయిన జలాశయంలో ఈ ప్రపంచానికి సంబంధం లేని జంతుజంత్రసమ్మేళనం అవిచ్ఛిన్నంగా అవిరళంగా అప్రతిహతంగా సాగుతూనే వుంది. బహుశా మనం గమనించలేదు. ఇక మనం మనాయించక పోవచ్చు. బహుశా మనం గమనం చేరకపోవచ్చును.

## 3

కొత్తసంవత్సరానికి మల్లే, కొత్తకాపురానికి మల్లే, కనుగవకి ఖరీదు లేని కాటుక రాసి, అద్దంలో తన పాప నొక్కసారి ముద్దులాడి, మురిపెంతో భర్తరాకకోసం ఎదురుచూసే, భార్య: పీధిపైట వాకిట్లో వచ్చేపోయే మొగాళ్ళ రద్దీకి, చూపుల తాకి

# "సాహిత్యంలో నీతీ ప్రయోజనమూ"

శ్రీ బసిరెడ్డి ఈశ్వరరెడ్డి

కోయిలలు కూస్తాయ్. మయూరాలు నృత్యం చేస్తాయ్. ఉషాదేవత రాగారుణ శోభతో దరహాసాన్నొలికిస్తుంది. చంద్రిక అమృతమయప్రకాశాన్ని చిలికిస్తుంది. మనం తత్సౌందర్యవీక్షణంద్వారా ఆనందపులకితుల మైపోతాం. అందువలన మన స్వార్థమేమీ నెరవేరదు. అదేవిధంగా మనం సాహిత్యాధ్యయనం చేస్తాం. భావావేశంతో తన్మయులం చిన్మయులమై పోతాం భగవంతుడు సృష్టించే ప్రకృతీ మానవుడు నిర్మించే సాహిత్యమూ రెండూ ఆనందానికే, ఆత్మవికాసానికే నిర్మలమైన సాహిత్యసరస్వతిని లౌకికస్వార్థాల కుపయోగించడం తగని పని.

రాజకీయాలుగానీ సంఘసంస్కరణగానీ జాతీయప్రశంసలుగానీ లేని రచన కొందరి దృష్టిలో సాహిత్యమే కాదు కమ్యూనిస్టు భాయీలు సాహిత్యంలో ధనికస్వరూప మైనా కన్పించకూడదంటారు. ఇది ప్రజాయుగ మనీ సాహిత్యమంతా కార్మికుల విప్లవగర్జనలతో నిండిపోవాలనీ శృంగారం గౌరవం మొదలైనవన్నీ బూర్జువా లక్షణాలనీ ఉద్ఘోషిస్తారు యిటువంటి అవిశాలహృదయులు వ్రాసిన విప్లవగేయాలూ జాతీయగీతాలూ యిప్పటికే నిర్జీవంగా అనేకం పుట్టుకొస్తున్నవి చర్వితచర్వణమైన భావాలతో అభిజాత్యత్వానికీ శృంగారానికీ మన సత్వానికీ విరుద్ధమైన ప్రచార సాహిత్యంతో భాషాక్షేత్రం అత్యంతభాగం కలుషితమైపోయినది కానీ ప్రజలహృదయా లింత నీరసమైనవా? శృంగారాలూ అభిజాత్యభావాలూ రాజులకు గాక పేదలకు రుచించవా మానవహృదయాలు సుత్తికొడవలి భాయీలు భావించు నంత నీరస మైనవా.

మన సత్వద్రష్టాల రాజులహృదయం పేదల హృదయం ఒక్కటే. అభిజాత్యభావాలూ ఆనందకల్పనలూ అందరికీ ఒక్కటే. నిత్య జీవితంలో అభిజాత్యం (*Arictocracy*) పనికిరాకపోవచ్చు కానీ కల్పనాక్షేత్రంలో నైనా పనికి రాదా? అభిజాత్యత్వం మానవసహజం. భౌతికభిత్తికపై నిర్మించబడిన సామ్యవాదంలోనే అనంతభావపూర్ణ సాహిత్యము నిరీకించడము సాధ్యం. సాహిత్యమున కానందమే పరమలక్ష్యం. సాహిత్యంలో కూడా ప్రయోజనాన్ని కోరేవారికి స్వాంతః సుఖానికి రచిస్తున్నా ననే తులసీదాసు మాటల్లోకూడా ఏసారమూ కన్పించక పోవచ్చు ఆనందమే పరమావధిగాగల రచనలో అడుగడుగునా నీతినీ ప్రయోజనాన్నీ ఆకాంక్షించడం తగదు ధార్మికంగా నీతి కత్యంతప్రాధాన్య ముండవచ్చును. లౌకికంగా ప్రయోజనమే ప్రాధాన్యంగా భావించబడ వచ్చును. నైతికసూక్తులు కల్పనాత్మక ప్రపంచాన్ని బంధించజాలవు కొందరు జర్మన్లు "గేటే" మహాకవి యైనా నైతిక సూత్రాల నుపేక్షించాడని ఆక్షేపించారు అందుకు కార్లైల్ యిచ్చిన జవాబు *"Meine herrendid you never hear the story of that—man who ridified the sun because it would not light his cigar"* వాస్తవమేమనగా కార్లైల్ చెప్పినట్లు మనస్వార్థాల కుపయోగించలేదని మహాకవినీ, మహోత్కృష్టరచనలనూ మనం తృణీకరించలేము అనుక్షణం మారుతుండే ప్రయోజననీతులగీటురాళ్ల సాహిత్యసౌందర్యాన్ని పరీక్షించలేము వేశ్యాలోలుడని శాకుంతల రచయితయైన కాళిదాసునూ మహాపాపి యని డాన్‌జువాన్ రచయితైన బైరన్‌నూ తృణీకరించలేము. స్మృతి పురాణేతిహాసాలతో పర్వతాకృతి ధరించిన సూక్తిజాలాన్నంతా సాహిత్యంలో యిముడ్చ నవసరంలేదు. నీతులనే గీటురాయిగా భావిస్తే మహాభారతరామాయణములు మహాకావ్యములుగానే లెక్కించబడజాలవు

ప్రొలిటేరియన్ (*Proletarian*) సాహిత్యం కావాలనే వాదం కొంతవరకూ ప్రాచీనమైనదే ప్రాన్సురాజ్య విప్లవంనాటి నుంచీ యీ వాదం ఏదో రూపంగా ఉన్నదట రష్యాలో జారుప్రభుత్వహయాంలో యీ వాదం అత్యంతంగా వృద్ధిపొంది కమ్యూనిస్టువిజయం తరువాత కార్యరూపాన్నికూడా ధరించినది ఆరంభములో యీ రకం ప్రచారసాహిత్యంద్వారా కొంత లాభమే కలిగియుండవచ్చు. కానీ విప్లవోద్రేకం తగ్గి కమ్యూనిస్టుప్రభుత్వం దృఢపడినతరువాత అక్కడి ప్రజలకు యీ రకం సాహిత్యములో ప్రయోజనమూ ఆకర్షణా ఏమీ లేకపోయ్యింది. అనేకమంది ఆంగ్లహిందీరచయితలీ విషయాన్ని ధృవపరిచారు. రష్యారచయితలకు తలమానికం వంటి టాల్‌స్టాయ్‌కూడా ప్రేమలోని మహత్వాన్నీ అహింసలోని ప్రయోజనాన్నీ బోధించాడే గానీ ఎక్కడా కార్మికులహుంకృతులనూ విప్లవజ్వాలల వికటాట్టహాసాన్నీ వినిపించలేదు గోర్కీగూడా ప్రొలిటేరియన్ ప్రజల జీవితాలనే కథావస్తువుగా తీసికొని మానసతత్వాల నద్వితీయంగా చిత్రించడాన్ని మరువలేదు సాహిత్యంలో ఒక కార్మికుడినే చిత్రించవచ్చును. కానీ ఆ కార్మికునిలో అలలు పొంగుతుండే భావోద్వేగాలను చూపించలేనప్పుడు ఆ నిర్జీవమైన బొమ్మకు ప్రాణం రాదు ఈ ప్రచారకసాహిత్యవేత్తలు క్రోధంతో ధనికునిపై దండెత్తే కార్మికుని స్వరూపాన్ని గాక పూరిగుడిసెలో పెళ్లాం పరాచకములతో ప్రపంచాన్ని మరచిపొయ్యే కార్మికుని స్వరూపాన్నీ రోగియైన సోదరుని మందుకై కూలీడబ్బులను వెచ్చించి తాను పస్తుపండుకొనే కర్షకుని మూర్తీభవించిన

త్యాగస్వరూపాన్ని పూర్తిగా విస్మరించారు. కూడూ గుడ్డకోసం పరితపించే కార్మికుడినే గాక మానవసహజమైన కామక్రోధమోహా సూయలలో పరితపించే కార్మికుడిని కూడా చూపించడమును నేర్చుకొనవలెను రష్యాలో తిరిగిన నిత్యానంద బెనర్జీగారు రక్కడి పరిస్థితులను గురించి యీ విధంగా వ్రాశారు *"peoples were tired of political sermons in news papers mass meetings factory debates, radios, and cinemas, so they wanted recreation in novels dramas and paintings instead of political teaching. many prominent critics voiced their discontent publicly and vehemently"* రష్యా ప్రజ లిన్ని రోజులకు యాథార్థ్యాన్ని తెలిసికొన్నారు. యిండియా ప్రజలో...

సాహిత్యం జీవితానికి సుందరమైన ప్రతిబింబం. సాహిత్యం మన స్వార్థాలను నెరవేర్చలేకపోయినా మన భావాలను మాత్రం చక్కగా ప్రతిబింబింప జేస్తుంది ఒక్క రసానికే ప్రజల్లోని ఒక వర్గానికే అది సీమితం కాలేదు. ఒక్కసారి వెనక్కు చూస్తే మన ప్రాచీనసాహిత్యవాతావరణ మెంత శృంగార భూయిష్టమో తెలుస్తుంది భూరిశ్రవుని భార్య దుఃఖంలో కూడా "అయం సరశనోత్కర్షీ పీన స్తన విమర్దనః నాభ్యూరుజఘనస్పర్శీ నీవీ విస్రంసనః కరః" అంటూ శృంగారకల్పనలతోనే విలపిస్తుంది. కానీ యీ శృంగారం ద్వారా మనసాహిత్యమున కే లోటూ కలుగలేదు. కేవలం నీతికి ప్రయోజనానికి మాత్రమే ప్రాముఖ్యత నిచ్చినట్లయితే శాంతవీరరసాలతోబాటు శృంగారభీభత్సరసాలకు నవరసాల్లో స్థానం కల్పించే అవసరమే లేకపొయ్యేది. కనుకనే మన ప్రాచీను లెంత ఆదర్శవాదులైనా మంచితోబాటు చెడ్డకు కూడా సాహిత్యంలో స్థానం కల్పించడానికి వెనుదియ్యలేదు. క్షుద్రమైన నీతి కలితమైనదే సాహిత్యం. ప్రవర్తనా పరిశుద్ధ్యానికి "సత్యం వద, ధర్మం చర" వంటి సూక్తు లుపకరిస్తాయి. కానీ చిదానందస్వరూపమైన సాహిత్య రసాస్వాదనకు రసాస్వాదనయోగ్యమైన హృదయ మొక్కటే చాలు. ఆ ఆనందమయసామ్రాజ్యములో నైతిక బంధనముల ప్రాధాన్య మనవసరం. కొన్ని హద్దులూ కొన్ని నైతికసూత్రాలూ కొన్ని ప్రయోజనాలూ ఆదర్శంగా నిర్ణంచుకొనబడిన శ్రేష్ఠమైన రచన ఏదీ లేదు. స్థూలంగా పరిశీలిస్తే "హేమ్లెట్" లో షేక్స్పియరు యొక్క సర్వశ్రేష్ఠ రచనలో దుర్బలహృదయంతో వ్యభిచారిణియైన తల్లినీ దుర్మార్గుడైన పినతండ్రినీ చంపడానికి సంకోచిస్తూ విచార దుఃఖాలలోపడి విలపించే ఒక్క రాకుమారుడు మాత్రమే చిత్రించబడ్డాడు. కాళిదాసు శాకుంతలంలో యువతీయువకుల ప్రేమలోని ప్రగాఢత్వం అపవాదాలకు భయపడి భార్యను విడిచిపెట్టే గుర్వలచక్రవర్తి మనస్తత్వమే చూపించబడినది. టాల్‌స్టాయ్ యొక్క "అన్నా కెరేనినా" లో అన్నా యొక్క దుర్భర దుఃఖమయస్వరూపమే చిత్రింపబడినది. ఆదర్శవాదులు కోరే నీతీ కార్మికసాహిత్యకులు కోరే ప్రయోజనం వీటిల్లో ఏమీ లేదు

ఉత్తమమైన సాహిత్యం నిర్మించబడవలెనంటే స్వస్థమైన హృదయం భావపూర్ణమైన మనస్సూ కావాలి. మనం దేశానికి ఉత్తమసాహిత్యము నర్పించవలెనంటే పాపపుణ్యములకూ స్వార్థప్రయోజనములకూ అతీతులై పోవాలి. మన జ్ఞానానికి మనస్సుకూ అన్నిరకాల ప్రవృత్తులద్వారా తగిన వికాసమును కల్పించుకోవాలి. మన సాహిత్యం అన్నిటిలోనా ప్రవేశించే ప్రాణవాయువు లాగుండవలెకానీ నన్ను ముట్టుకోకు అన్నట్లుండగూడదు. పవిత్రనీతిబరువునంతా సుకోమలసాహిత్యముపై వేసి అడుగడుగునా దానిని నియమబద్ధంగా నడవమనడం హాస్యాస్పదం కాగలదు మన సాహిత్యం యింత గతిహీనం కావడానికి కారణ మిదే. ఒక్కసారి గ్రీసు ట్రేజడీలనూ షేక్స్పియర్ నాటకాలనూ పరికిస్తే వాటిల్లో వ్యభిచారక్రోధావేశాలే కన్పిస్తాయి శరత్ హేమచందుల నవలలలో ప్రవృత్తులకు లొంగిపోయే మనవంటి అల్పమానవులే కన్పిస్తారు. నేటి సమయంలో యిటువంటి ప్రవృత్తులకు లొంగిపోయే అల్పమానవులే మన ల్నాకర్షించగలరు గానీ మన ఆదర్శాల కేమాత్రం అందనంతటిదూరంలో ఉండే హరిశ్చంద్రదధీచిమాంధాతల చరిత్ర కనీసం మనలో భావసంచలనము నైనా కల్గించలేదు. గొప్పఆదర్శాలను భావించుకొనడంకంటే మన హృదయాల్లో భావసంచలనం కల్గించే రచన శృంగారికమైనా కల్మషభూయిష్ఠమైనా నైతికప్రయోజన రహితమైనా ఆదర్శంగా భావించబడవలసినదే. సాహిత్యం గతివంతమైనది. వికాస వంతమైనది స్వాతంత్ర్యమే కవితకు జీవశక్తినిస్తుంది. 'నీశో' భయంకరవ్యభిచారమును వర్ణించినా భవభూతి ఉత్తమోత్తమమైన కరుణరసాన్ని చిత్రించినా సాహిత్యంలో రెంటికీ విలువ ఒక్కటే - సంస్కృత సాహిత్య ప్రాసయుగంలో బంధనాలద్వారా సాహిత్యమెంత నిర్జీవమైనదీ మనకు తెలియును పూర్వ రాజాశ్రయంవలెనే నేడూ కవికి ప్రజాశ్రయం కావాలె. అంతమాత్రంచేత ఒకవర్గపు ఘోషనే ఎప్పుడూ వర్ణిస్తూ కూర్చోవడం పొరపాటు. యీ ప్రొలెటేరియట్ సాహిత్యపు పిచ్చి హిందీ రచయితలకు వలెనే తెలుగు రచయితల కెక్కువగా ఆవేశించకపోవడం ముదావహం. సంకుచితహద్దులను విడిచి పరిపుష్టమైన వుజ్జ్వలసాహిత్యరచనకు ప్రయత్నించవలెను. ఏకవితలో జాతీయభావాలు లేవనీ యీకవితశృంగారభూయిష్టమైనదనీ విమర్శించకూడదు. అడుగు దాటకుండా యమకానుప్రాసలతో సమాసభూయిష్టమైన కవిత్వమును చేసి సంతోషించే వాళ్లకూ కూలీ కవిత్వమంటూ ఆవేశంతో ఉరకలెత్తే వాళ్లకూ మనంచెప్పవలసినదేమీ లేదు ప్రతిభావంతుడై నియమాలకూ వాదాలకూ లొంగని కవికి స్వాగతమివ్వనిదే యేసాహిత్యమైనా ఔన్నత్యమును పొందజాలదు.

---

# కొత్తఫోర్మన్

(గల్పిక)

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

"ఇదుగో కొత్త ఫోర్మన్," అన్నాడు భయ్యా మొహిద్దీన్‌కు రాగి అచ్చులు రెండూ ఒకదాని వెనక ఒకటి అందిస్తూ.

మొహిద్దీను గోతాములు తొడుక్కున్న చేతులతో ఒక్కొక్క రాగిఅచ్చూ బట్టీల లోకి జారవిడిచి వేడికిఅంటుకున్న గోతాములను ఒక దానికొకటి కొట్టి రవ్వలుఆర్పాడు. చెమటలు ధిగగారే మొహానికి చెయ్యి అడ్డు పెట్టుకుని ఆఖరుసారి మూసలోకి చూశాడు. అతని మొహాన మూసలోనుంచి వచ్చే ఎర్రని కాంతి పడుతున్నది.

భయ్యా ఈలోగా తుత్తునాగం అచ్చులు రెండు తెచ్చి బట్టీ పైభాగాన, మంటకు ఎడంగా పెట్టి, బట్టీ వెనక్కు వెళ్లి నిలబడ్డాడు.

మొహిద్దీన్ బట్టీ దిగివెళ్లి వెనకనుంచి ముందు కొద్దిగా తైలం బర్నరులోకి వదలి తరవాత గాలి పోనిచ్చాడు. బట్టీలోనుంచి "ధాం" మని శబ్దం వచ్చింది. బట్టీమీదుగా నూనె పొగతోకూడిన ఎర్రని జ్వాలలేచింది.

కొత్తఫోర్మన్ దృష్టిని తనకేసి ఆకర్షించటానికే మొహిద్దీన్ బట్టీని మోగించాడు. ముందు గాలి వదలి, తరవాత నూనె వదలాలని వాడికి తెలీకకాదు.

ఫోర్మన్ బట్టీదగ్గిరికి వచ్చాడు. మంటకేసి చూశాడు. అతని కళ్లలో మొహిద్దీనుకు అజ్ఞానం కనిపించింది.

"ఇదే మొదటిసారి బట్టీమీదికి రావటమా?" అన్నాడు మొహిద్దీన్.

"నేను దీన్ని ఎన్నడూ చూడలేదు." అన్నాడు కొత్త ఫోర్మన్.

"అందుకనే షికారుకు వెళ్లే బట్టలు వేసుకున్నావు ఇక్కడ పనిచేసే బట్టలు వేసుకోవాలి." మొహిద్దీన్ తన బట్టలకేసి ఒకసారి చూసుకున్నాడు.

కొత్తఫోర్మన్ మాట్లాడలేదు. అతనింకా బట్టీలోనంచి వచ్చేమంట వేపే చూస్తున్నాడు.

"అవతల బట్టీలు దీనికన్న జోరుగా, ఇంకా మోతగా మండుతున్నాయే?" అన్నాడు ఫోర్మన్.

"ఇదీ.మండుతుంది టైము వస్తే," అన్నాడు మొహిద్దీన్ బట్టీకేసి ఆపేక్షగా చూస్తూ.

అందులో ఏమిటి వేశావు?" అన్నాడు ఫోర్మను.

"మందు. బిస," అన్నాడు మొహిద్దీను, తన చమత్కారానికి తానే ఆపుకోలేకుండా నవ్వుతూ.

కొత్తఫోర్మను బట్టీవాడి వెటకారాన్ని లక్ష్యపెట్టలేదు.

"ఇంకా 20 నిమిషాల్లో దిగుతుంది కాదూ?" అన్నాడు.

"బట్టీ మహిమను బట్టి!" అన్నాడు మొహిద్దీను

కొత్తఫోర్మనుకు ఇత్తడి కరిగించటం ఏమీ రాదని షిప్టులో వాళ్ళందరికీ పాకిపోయింది అతను ఎవరికీ ఏపనీ చెప్పలేదు. వాళ్లు చేసేపను లేవీ వద్దనికూడా అనలేదు.

మూడోబట్టీ దిగేటప్పుడు కాబోలు అతను బట్టీ దిగడానికి సిద్ధంగా ఉందని మొహిద్దీనుకు జ్ఞాపకం చేశాడు.

కరిగిన ఇత్తడి అచ్చుల్లోపోసే ఇద్దరిలో ఒకడైన రహమాన్‌మాత్రం గొణిగాడు: "పనిఅంతా చచ్చేట్టు మనం చేస్తాం. బళ్ళో చదువుకునే కుర్రాణ్ణి తెచ్చి మనమీదవేసి మనకన్న ఎక్కువజీతం ఇస్తారు."

ఈ భావమే అందరికీ కలిగింది.

మొదటిరోజు అనుభవంతో కాబోలు రెండోరోజునుంచీ ఫోర్మను ఎవరి పనులు వాళ్లకు చెప్పసాగాడు. పనులు చకచకా చెయ్యనివాళ్లని తొందరపెట్టసాగాడు.

మొహిద్దీన్‌కు ఈ ఫోర్మనువల్ల నీరసం వచ్చింది. అతని మనస్తత్వం ఎటువంటిదంటే తనమీద ఎవరూ లేకుండా ఉన్నా, గట్టివాడున్నా పనులు సరిగా చెయ్యగలడుగాని అసమర్థుడుంటే పని చెయ్యలేడు. రెండోరోజు మొదటిచార్జి అరగంటకుగాని దిగలేదు. రెండోచార్జీ ఎక్కింది. బట్టీ నిరుత్సాహంగా మండుతున్నది.

"ఈ చార్జీకూడా ఇరవైనిమిషాల్లో దిగేట్టు లేదే. మంట కాస్త హెచ్చించు," అన్నాడు ఫోర్మన్.

వెంటనే మొహిద్దీన్ గాలి హెచ్చించి మోత పుట్టించాడు. అతను ఇవతలికి రాగానే ఫోర్మను, "నీకు బట్టీమీద చాలా అనుభవం ఉందనుకుంటా" అన్నాడు.

"రెండున్నరఏళ్ల అనుభవం ఉంది. నేనిక్కడికి వచ్చినప్పుడు నాఛాతీ ఇంత ఉండేది. నా వొంట్లో నలభై పౌనులు ఈ బట్ట తినేసింది."

"అట్లా అయితే నేను నీకు చెప్పనక్కర్లేదు కొంచెం నూనె కూడా వదులు. ఇంకోమాట. మధ్యమధ్య నూనె వొదిలి గాలి వదులుతున్నావు. అందువల్ల చప్పుడైతే వినటానికి సొంపుగా ఉంటుందిగాని మూస పగిలిపోతుంది. నీజీతంలోనుంచి నూట ఇరవైరూపాయలు బిగపడతారు. అందుకని అట్లా చెయ్యకు," అన్నాడు ఫోర్మను.

కొత్తఫోర్మను ఎవరికీ నచ్చలేదు. మొహిద్దీనుకు అసలే నచ్చలేదు.

మూడోరోజు ఒక సంఘటన జరిగింది. పక్కనున్న బట్టీమీద పనిచేయించే ఫోర్మను ఈబట్టీకింద పనిచేసేవాణ్ణి ఒకణ్ణి పిలుచుకుపోయి ఏదో పనిచెప్పాడు.

ఈసంగతి మొహిద్దీను కొత్తఫోర్మనుకు చెప్పి "ఏంచేస్తావిప్పుడు?" అని అడిగాడు.

కొత్తఫోర్మను చుట్టూ చూసి "బట్టీ ఆర్పెయ్యి," అన్నాడు.

మొహిద్దీను భయపడ్డాడు.

"బట్టీ ఆర్పెయ్యి. చూస్తావేం?" అన్నాడు ఫోర్మను.

మొహిద్దీను బట్టీ ఆర్పేశాడు.

అల్లరి జరిగింది. వర్క్సుమేనేజరు కండలూడ బెరుక్కుంటూ వచ్చి కొత్తఫోర్మను మీద కేకలు వెయ్యసాగాడు.

కొత్తఫోర్మను తొణకలేదు.

"నాపనివాణ్ణి నా అనుమతిలేకుండా ఎవరో పట్టుకెళ్లారు. వాడెప్పుడువస్తాడో నాకు తెలీదు. వాడు వచ్చేదాకా బట్టీకాలుతూ ఉండడానికి వీల్లేదు. నాకు తుత్తునాగం నష్ట

[పాశ్చాత్య వాగ్గేయ కారుడు]

# "మెసయా" సంకీర్తనకర్త - హేండెల్



**1741** వ సంవత్సరము. శీతకాలపునడి రాత్రి నడుంవంగిన ఒక వృద్ధుడు, లండన్ వీధులలో ఉబ్బపట్టలేక ఉక్కిబిక్కిరి ఔతున్నట్లు, చీకటి వీధులన్నీ తిరిగేస్తున్నాడు. జార్జిఫ్రెడెరిక్ హేండెల్, ఆ వృద్ధుని పేరు. అనక్తంచరత్వము వరుసను కొన్ని రాత్రులబట్టి అతనికి పరిపాటి అయిపోయింది. మనస్సు నైరాశ్యంతో కుమిలిపోతోంది. గత వైభవమంతా కన్నులకు కట్టి ఆ కుమిలిపాటును మరింత రెచ్చగొట్టూంది.

అతని కప్పుడు అరవైఏళ్లు గత నలభై సంవత్సరాలుగా, ఇంగ్లండులోనూ, యూరప్‌లోనూ గల రాజసంస్థానా లన్నిటిలోనూ ఆస్థానసంగీతవిద్వాంసగౌరవాలు అందుకొన్నాడు. మహారాజులకు మహారాణులకు ఉత్తమసంగీతకృతులు రచించి అంకితం చేసిపెట్టాడు. యూరప్‌లోని మకుటాధిపతులు అందరూ, అతని గానమాధుర్యం ఆస్వాదించి, అనేకవిధాలుగా అతన్ని బహూకరించారు ఉత్తమ గౌరవ మిస్తూ వచ్చారు.

ఇంతలో ఆస్థానాలలో అతనికి పలుకుబడి అకస్మాత్తుగా తగ్గసాగింది. అతనంటే ఈర్ష్యతో మండిపోతున్న, తోటిపండితమ్మన్యులంతా రౌడీమూకలను పోగుచేసి, అతనిగానసభలను చెల్లాచెదురు చెయ్యసాగారు అతని సంగీత కచ్చేరీలకు రాబడి తగ్గిపోయింది. హేండల్ వృద్ధాప్యంలో మళ్లీ దరిద్రుడయ్యాడు.

1736 లో అతనికి మెదడులో రక్తసిరలు తెగి, పక్షవాతం వచ్చి, కుడిచేయి, కాలూ పడిపోయాయి. నడవలేక పోయేవాడు కుడిచేయీ, కాలూ, కదపటానికి వచ్చేవికావు. కాగితంమీద అక్షరం పెట్టేందుకుకూడా వీల్లేకపోయేది. ఇక చెయ్యి కాలు రావటం దాదాపు అసంభవమే అన్నారు వైద్యులంతా.

ఎయిలాషెపుల్ అన్న ఆరోగ్యప్రదేశానికి వెళ్లాడు అక్కడ వేడినీటిస్నానాలు ప్రారంభించాడు. రోజుకు మూడుగంటలకు పైన నీటిలో ఉంటే చచ్చిపోతావన్నారు డాక్టరులు. రోజుకు తొమ్మిదిగంటలు సలసల కాగే నీటిలో స్నానం మొదలెట్టాడు హేండెల్. నెమ్మది నెమ్మదిగా కండరాలు స్వాధీనంలోకి రాసాగాయి. కాలు చెయ్యీ కదపగలిగాడు నడక కాస్త సాగించాడు. ఉగ్గ్రతంగా మళ్ళీ సంగీత కృషికి కీర్తనల రచనకు ఉపక్రమించాడు. వరుసగా నాల్గు ఒపేరాలు, సంగీతనాటకాలు, రచించాడు. మళ్లీ ఒక్కసారి గప్పమని పేరులోకి వచ్చాడు

కేరొలీన్ రాణి ఆదరణలో ఎక్కువ బ్రతుకుతూండేవాడు. ఆమె చనిపోయేటప్పటికి హేండెల్ ఆదాయం ఒక్కసారిగా సన్నగించింది. ఆ సంవత్సరాలలో ఇంగ్లండులో శీతకాలము మరీ విపరీతంగా ఉంది. నాటకశాలలకు సంగీతసభలకు ప్రజలు వచ్చే స్థితిలో వాతావరణం ఉండేది కాదు పాటకచ్చేరీల హాలుల్లో చలికాచుకొనేపద్ధతు లేవీ ఉండేవికావు. శీతవాయువుకి జడిసిసంగీత సభలు అన్నీ మూసేశారు. హేండెల్ అంతకంతకూ అప్పులపాలవసాగాడు. అప్పు పెరిగినకొద్దీ చికాకు ఎక్కువయి, మనిషిలో ప్రతిభ, కూడా సన్నగించిపోయింది. సంగీతములో మునుపటి పటిమ రావటంలేదు అరవయేళ్లు సమీపించాయి. నిస్పృహుడూ, నీరవుడూ అయి కుములుతూ, చీకటిపక్షిలాగ రాత్రిళ్లంతా ఆ చలిలో రోడ్లు చెడ తిరుగుతూ, ఏంచేసినా మనశ్శాంతి లేక కుములుతూండేవాడు.

ఆ తిరగటంలో ఒక చర్చి సమీపంలోకి వచ్చాడు మనస్సంతా కుముల్తూ, ఆలోచనలన్నీ చేదుకక్కుతూ మనిషిని ఎపిరి తిపిరి చేస్తున్నాయి. వెలిబూడిద నోట నిండినట్లున్నది జిహ్వ మనస్సూ కూడా. తనమీద తనకు అసహ్యమూ జాలీ పుడుతున్నాయి. ఆ చర్చిలో ప్రార్థనలు గంటలూ తదంగమంతా వింటూ నీరవుడై అక్కడ నిల్చుని తన విధిని తిట్టుకొంటున్నాడు.

"నాతోటివాళ్ళంతా నన్ను ఇల్లా అజ్ఞాతంలో పాతిపెట్టేసేందుకేనా, ఇంత జబ్బుపడ్డాక భగవంతుడు నన్ను మళ్ళీ బ్రతికించింది? సంగీతం సృష్టిచేయలేని ఈ నాప బ్రతుకు, ఎందుకు ఇచ్చినట్లు నాకు." అనుకొంటూ హృదంతరాలలోనుంచి విలపించాడు. "భగవాన్! భగవాన్! ఈ దీనుణ్ణి ఎందు కిల్లా పరిత్యజించావ్" అని ఆక్రోశించాడు.

అర్ధరాత్రిదాటాక నిస్సత్తువతో గది చేరుకొన్నాడు. బల్లమీద ఒక కాగితపు బంగీ ఉంది విప్పిచూచాడు. ఒక మూడోరకం రచయిత ఛార్లస్ జెన్నెన్స రచించి "సేక్రెడ్ ఆరెటోరియా పవిత్రగీతిక" అనే నాటకం. దీన్ని సంగీక నాటకంగా తయారు చేయమంటూ "భగవంతుడీ పని నియమించాడు." అని రచయిత వ్రాసి పంపాడు.

హేండ్‌ల్‌కు చిరాకువేసింది. "భగవంతుని దూత ననుకొనేటంత పొగరెక్కిందా జెన్నెన్సుకు" అని చీదరించుకొన్నాడు. హేండెల్ మహాభక్తుడు కాడు. బీదలకు, ఆర్తులకు చేతనైన సహాయాలు చేస్తూనే ఉండేవాడు. కాని మనిషిలో చిఱ్ఱుబుఱ్ఱూ, పలుకు ప్రల్లదనమూ, ఎక్కువ. అందుచేత మిత్రులకన్నా శత్రువుల్నే ఎక్కువమందిని సృష్టించుకొన్నాడు. ఈ జెన్నెన్సు, అంతగా తన్ను స్వరమువేసి సంగీతనాటకం చేసిపెట్టమని అడిగేవాడైతే, ఏవో మామూలు చలాకీనాటకం పంపుకోక, ఈ భక్తి సంబంధమైనది పంపటం ఏమిటి?

ఆ చిరాకుతోనే అల్లాగే చదవటం

---

మవుతుంది. నేనెవరిని అడిగి తెచ్చుకోవాలి ?" అన్నాడు.

రెండోఫోర్మనుకు గూటింపులు తగిలాయి. అతను కొత్తఫోర్మనుకు క్షమాపణ లిచ్చాడు. కూలివాడు తిరిగివచ్చాడు.

ఆ రోజు నుంచీ కొత్తఫోర్మనుమాట మొహిద్దీనుకు వేదాక్షర మయింది.

మొదలుపెట్టాడు చదివినకొద్దీ, నాటకంలో వస్తువు తన మనస్థితికి సన్నిహితంగా కనిపించింది "అతను భగవంతుని నమ్మాడు – భగవంతుడా ఆత్మ నా నరకంలో వదలలేదు – అతడే నీకు రక్ష"—అన్నమాదిరి వాక్యాలు నాటకంలో కనబడ్డాయి

అంతకంతకూ ఆ వాక్యాలు, అతని బుర్రలో ప్రజ్వలింపసాగాయి "జయ జయ భగవాన్" అంటూ స్వరయుతంగా సంగీతం హృదయాన్ని మేధస్సునీ నింపసాగింది మునుపటి రసస్థితి, ప్రతిభా, మళ్లీ తనలో మేల్కొంటూన్నట్లుగా హేండల్ కు సూచితమయింది – నాదం మననం చేసుకొంటూ అల్లాగే కూర్చుండిపోయాడు

మర్నాడు ప్రొద్దున్న నౌకరు వచ్చిచూచేటప్పటికి యజమాని నిద్రపోలేదు మేజా దగ్గిర కూర్చుని తలచేతుల్లో పట్టుకొని అంతర్దృష్టిలో లీనమైపోయి ఉన్నాడు. యజమానిదీక్షకు భంగం కల్గించకుండా, నౌకరు ఆహారం అక్కడ ఉంచి చల్లగా జారుకొన్నాడు మధ్యాహ్నం మళ్ళీ వచ్చి చూచాడు కంచంలో ఆహారం కంచములో కదలకుండా అట్టేవుంది మధ్యమధ్య మాత్రం యజమాని ఒక రొట్టి ముక్కను వేళ్లతో తీసి అటు దృష్టి లేని ఆవేశంతో పొడిపొడిగా వేళ్ళమధ్య నలిపివేసూ క్రింద పోస్తున్నాడు. ఉండి ఉండి కుర్చీలోనుంచి గ్రహం పూనినట్లు రాగాలాపన చేస్తూ, గదిలో ఇటూ అటూ గబగబా పచార్లుచేస్తూ మేజాదగ్గిరకు వచ్చి స్వరకల్పన కాగితం మీద ఎక్కిస్తూ, మళ్ళీమళ్ళీ పాడుకొంటూ "హాల్లేలూజా! హాల్లేలూజా" (భగవాన్ జయ, భగవాన్ జయ) అని రాగం సరిచేసుకుంటూ, ప్రసవవేదనలో ఉన్నట్లున్నాడు.

నౌకరు తెల్లబోయి, ఒక స్నేహితునితో సంప్రదించాడు. "మునుపెప్పుడూ యజమాని ఇంత ఇల్లా లేడు. నావంక చూస్తూనే ఉంటాడు – కాని నన్ను చూస్తూన్నట్టుండడు. ఆ మాట్లాడటంకూడా ఎవరితోనో మాట్లాడుతున్నట్లు మాట్లాడుతాడు. స్వర్గ ద్వారాలు తనకోసమని బారుగా తెరిచి ఉన్నాయంటాడు. ఈ బాబుకు పిచ్చెత్తుతోందేమోనని భయం వేస్తోంది."

ఆ వరుసను ఇరవైనాలుగు రోజులు, నిద్రాహారాల దృష్టిలేకుండా, హేండల్ దీక్షతో రాక్షసుడిలాగా ఆ నాటక సంగీతంపై కృషి చేశాడు. పూర్తిచేసి, నీరసంతో ప్రక్కమీద వాలిపోయాడు.

టేబిల్ మీద "మెస్సయా"అన్న ఆ నాటకానికి కావలసిన సంగీతం అంతా స్వరపరచిఉంది ఆ పడుకోటం పడుకోటం 17 గంటలు అదే వరుసను నిద్రపోయాడు నౌకరు చచ్చిపోతున్నాడేమో అని భయమేసి డాక్టరుకు కబురంపాడు డాక్టరు వచ్చేలోపలే హేండెల్, "ఆకలి – ఆకలి" అని అవురావురు మంటూ నిద్ర లేచాడు. తిండి తిని తేరుకొనేటప్పటికి డాక్టరు వచ్చాడు డాక్టరును చూసి నవ్వుతూ "ఏమయ్యాయ్, డాక్టరు, చుట్టపు చూపుగా వచ్చినవాడవైతే కూర్చుని భోంచెయ్ నాడిపరీక్ష గీడిపరీక్ష అంటూ నా దుంప తెంచటానికి వచ్చిఉంటే ముందు అవతలికి నడు" అన్నాడు

లండన్ లో "మెసయా" సంగీతనాటక ప్రదర్శనానికి అవకాశం లేకపోయింది డబ్లిన్ తీసుకొని వెళ్ళాడు అక్కడి రాజ్యాధికారులు కూడా అతన్ని సంతోషంతో ఆహ్వానించారు ఈ నాటకానికి వచ్చే ఆదాయం, అంతా దానధర్మాలకు వినియోగించాలన్నాడు హేండల్ నైరాశ్యంలో పడిపోయినప్పుడు, తన్నుకు సందేశమిచ్చి ఉద్ధరించిన "మెసయా" దేవదూత, ఈ నాటకం నేడు ప్రపంచానికే ఆశాసందేశం అవాలి ఇది" అన్నాడు హేండల్ 1742 ఏప్రిల్ 13 న హాలు కిటకిటలాడిపోతూంటే మెసయా నాటక ప్రదర్శనం ప్రారంభమయింది అసంగీతానికి ఆనందతో కైపెక్కి హర్షధ్వనలు చేశారు

నాటకం సప్తమ్యాలు ఆడారు నాటకంలో లండన్ లో "హాల్లేలూజా" అనే భజనగీతం ఉంది అది వచ్చేటప్పటికి నాటకం చూస్తున్న ఇంగ్లండు రాజు నమ్రుడై నిలబడ్డాడు సభికులంతా నిలబడ్డారు ఈనాటికీ ఈగీతంరాగానే ఈ ఆచారం సాంప్రదాయమైపోయింది

హేండిల్ బ్రతికున్నప్పుడు ఈనాటకం ఏటేటా ఆడించేవాడు దాని ఆదాయం అనాథశిశువైద్యశాలలకు వెళ్ళేది

హేండిల్ తర్వాతరోజుల్లో కూడా దారిద్ర్యం అనుభవించకపోలేదు కాని ఎంతటిదారిద్ర్యంలోనూ నైరాశ్యంతో కుమిలిపోవటం మాత్రం మళ్ళీ సంభవించలేదు ఆనాటకమే అతనికి దైవదత్తమైన ఆశాసందేశంగా మారింది

1759 ఏప్రిల్ 6 తారీఖున అప్పటికి – హేండిల్ కు 74 ఏళ్లు వచ్చాయి – ఒక హాలులో 'మెసయా' నాటకం చూస్తూండగా హేండల్ స్మృతితప్పి పడిపోయాడు అతన్ని నెమ్మదిగా ఇంటికి చేర్చారు వారం రోజులు పక్కలో ఉన్నాడు "గుడ్ ఫ్రైడే నాడు మరణిస్తే బాగుండు"నని చెప్పుకొన్నాడు ఏప్రిల్ 13న, సరిగ్గా "మెస్సయా"నాటకం ప్రదర్శితమయిన వార్షికోత్సవంనాడు, హేండెల్, అసువులు విడిచాడు

ప్రపంచానికి "మెస్సయా"నాటకం సంగీతంతో అనంతమైన ఆశాజ్యోతిని సృష్టించి వదిలాడు హేండిల్

(క్రిస్టియన్ హెరాల్డునుండి)



రాడారు కంట్రోలు కార్యాలయం కొత్తకాడారు 20 వేల అ. ఎత్తున 130 మైళ్ళదూరంలోని విమానాలను పసికట్టగలదు.



'నయా సోమనాథ్ మందిర్' నవీనసోమే నాథ దేవాలయం.



దేవాలయ శిథిలాలలో బైలుపడిన విగ్ర



దేవాలయ శిథిలాలలో బైలుపడిన విగ్రహాలు



'ఉత్తర ప్రాకారం' ప్రతి అంగుళం శిల్పకళ

# సోమనాథ దేవాలయం

రచన
జగన్ మోహన్



ఛాయాచిత్రణ
కృష్ణమోహన్

మహమ్మదీయులు మన దేశంలో కొన్ని మంచిపనులు చేశారు— కొన్ని చెడ్డపనులూ చేశారు. శిల్పముల విషయంలో; సప్త విచిత్రాలలో నొకటైన తాజ్ మహాల్ చాలు, యింకా కుతుబ్ మీనార్ మొదలైన వెన్నో కట్టించారు. కాని, హిందూశిల్పకళని చేయకలిగినంతగా నశింపజేశారు.

అట్లా నాశనం కాబడ్డవాటిలో ఒక ప్రసిద్ధమైనటువంటిది యీ 'సోమనాథ దేవాలయం'. దీని నాశనాన్ని గురించిన చరిత్ర సామాన్యంగా అందరికీ తెలుసును గజని మహమ్మదు పదునాలుసార్లు యీ అత్యద్భుతశిల్పకళామయపరమపవిత్ర దేవాలయాన్ని కొల్లగొట్టాడు కొన్ని వందల సంవత్సరాల క్రితం. అయినా యీ రోజువరకూ కూడా దాని శిల్పచాతుర్యం మనలను ముగ్ధులను చేస్తుంది.

అచ్చటివారు చెప్పే ప్రకారం: గజినీమహమ్మద్ చేసిన దండయాత్రల్లో బ్రాహ్మలు తీవ్రంగా పోరాడారని, ఆ సందర్భంలో సోమనాథుని ప్రార్థించడానికి అసలు దేవాలయం శత్రువులచేత నుండటంచే, వేరే ఒక భూగర్భదేవాలయంలో రాత్రింబవళ్లు ప్రార్థనలు సల్పుతుండేవారని, అప్పుడు కట్టినటువంటి గుహ కలిగినదే 'నయా సోమనాథ్ మందిర్' అనీ తెలుస్తుంది.



దేవాలయ శిథిలాలలో బైలుపడిన విగ్రహాలు



'జునా సోమనాథ్ మందిర్'

గజనీమహమ్మద్ చే 14 సార్లు దోచుకోబడి శిథిలావస్థలో నున్న పురాతన ప్రసిద్ధ సోమనాథ దేవాలయం.

# ★ సోమనాథ దేవాలయం ★

ప్రస్తుతపు 'సౌరాష్ట్ర'లో నున్న సోమనాథ్‌పట్టణ్ ఒక కోటగోడ మధ్య నుంది. పశ్చిమాన్ని 'కాశీ' వలె యెంచుకోబడిన యీ దేవాలయం ప్రక్కనున్న సముద్రపాయను "త్రివేణి" నామంతో పవిత్రగంగగా యెంచి అందు స్నానం చేసి సోమనాథుని దర్శించుకొంటుండే వారు. కాని, అది సర్వనాశనం చేయబడినతర్వాత దానిని మూడటానికి మాత్రం అప్పుడప్పుడు కళా పిపాసులు వస్తూంటారు. ప్రస్తుతం దాని కళాచిహ్నాలుగా నిలిచియున్నా ఉత్తరదక్షిణప్రాకారాలు అత్యద్భుతశిల్పచాతుర్యంతో చూపరుల కాశ్చర్యం కల్గజేస్తున్నయ్.

ఈ మధ్యను ప్రభుత్వదృష్టి, ముఖ్యంగా మన ఉపప్రధానమంత్రి శ్రీ సర్దార్ వల్లభాయ్‌పటేల్ వారి ప్రత్యేకశ్రద్ధకతమున యీ పవిత్ర దేవాలయం పునరుద్ధరించబడుతూంది. పాతుకుపోయిన కొన్నిటి త్రవ్వటంలో వెలువడుతున్న కొన్ని చెక్కడాల సౌందర్యం చూచి యానందించాల్సిందే! హిందూశిల్ప కళలోని వున్నతి తిరిగి యీ దేవాలయం పునరుద్ధరింపబడిన పిదప మనం చూడగలం'



సోమనాథదేవాలయ 'దక్షిణప్రాకారం'
అత్యంత శిల్ప చాతుర్యాన్ని చాటుతున్నది.

# దౌర్జన్యము విప్లవతత్వంకాదు

కమ్యూనిస్టులు జరుపుతున్న దౌర్జన్య కృత్యాలు పూర్తిగా కేవలం హింసాచర్యలే. ఇళ్ళపై దాడులు, దోపిడీలు, హత్యలు - ఇవే. వ్యక్తులను కొట్టటం, చంపటం, డబ్బు దోచుకుపోవటం బహుశ ఈ కమ్యూనిస్టులు, వారి సానుభూతిపరులు ఈ సందర్భంలో కొన్ని 'విప్లవ-మంత్రా'లను ఉచ్చరించవచ్చు. 'మేం చంపుతోంది ధనికులను, భూస్వాములను, సంఘవిద్రోహుల్ని' అని. పోనీ ఈవిధంగా చూసినా ఈ 'బూర్జువా' వారు కొద్దిమంది అకాల, బలవన్మరణానికి ఆహుతి అవటమే తప్ప, వారికి జీవగర్రగా ఉన్న ఆర్థిక, సాంఘిక నిర్మాణం హత్యలతోపాటు హతం కావట్లేదు. కాజాలదు.

ఇప్పటి ఆర్థికవ్యవస్థ కొద్దిమంది మరణంతో పెట్టుబడిదారీ స్వరూపం పోగొట్టుకొని, అమాంతం కమ్యూనిస్టువేషాన్ని ధరిస్తుందనుకోటం భ్రాంతి. ఏ విప్లవతాత్త్వికుడూ ఈ దౌర్జన్యాన్ని, ఈ హత్యలను, ఈ దోపిడీలను ఆమోదించడు. అహింసను నీసడించి, హింసనే ఆమోదించేవాడు కూడా ఎవడూ ఇలాంటి రక్తపాతానికి హర్షించడు.

'మేం నాలుగేళ్ళనుంచి పోలీసులను నానావిధాలా విసిగిస్తున్నాం. చూసుకోండి. మా దళాలు:. మేము ఇవ్వాళ ఒకచోట. రేపు మరొకచోట' అని కమ్యూనిస్టు మతోన్మాదులు భుజా లెగురువేసుకోవచ్చు. 'ఆ ప్రజాపీడకుడి మెడ పిసికాం, ఈ ప్రజావిరోధి గుండెలో గుండు పేల్చాం' అని మీసాలు మెలిపెట్టుకోవచ్చు. కాని ఈ అరాచకంవలన దేశంలో కమ్యూనిస్టు వ్యవస్థ ఏర్పడకపోగా, ప్రజలు శాస్త్రీయమైన రాజకీయ, సాంఘిక, ఆర్థికవిషయ జ్ఞానం లేక పరస్పరహత్యాకాండంలో పరవశులవుతారు. వ్యక్తిహత్యల మధ్య నూత్న సమాజం ఉద్భవించదు.

ఇప్పటి ఆర్థికవ్యవస్థ అధికసంఖ్యాకులను అన్నివిధాలా అణచిపెట్టుతోంది విద్య, వైద్యం, ఇల్లువాకిలి వగైరావిషయాల్లో అధికసంఖ్యాకులకు అన్యాయం జరుగుతోంది ఈ ఆర్థికవ్యవస్థస్థానే ప్రజలందరకు వికాసం కల్గించే వ్యవస్థను నిర్మించాలంటే, ఇప్పుడు అన్ని వసతులను అపరిమితంగా, గుత్తగా అనుభవిస్తున్న అల్పసంఖ్యాకులను హతమార్చటం కాదు మార్గం. అధికసంఖ్యాకులు తమ జీవితాలను తమ వారసుల సుఖశ్రేయస్సులకోసం త్యాగంచేసి, నూత్నసమాజాన్ని స్థాపించే నిర్మాణాత్మకమైన విస్తృత-ఉద్యమాన్ని ఆరంభించాలి ఈ ఉద్యమానికి అల్పసంఖ్యాకులు అడ్డు తగిలి, దౌర్జన్యానికి పూనుకొని, వారి దౌర్జన్యాన్ని ప్రభుత్వం ద్వారా ఓడించలేకపోతే, అప్పుడు వారిని దెబ్బకు దెబ్బతో సత్కరించక తప్పదు-హింసావాదంధ్రష్టా

శ్రీ సహజానందం

అంటే బీదరైతులు, కూలీలు, చేతివృత్తివారు, కార్మికులు, చిన్నఉద్యోగస్థులు, మధ్యతరగతివారు ముందు, విషయాలను అవగాహన చేసుకొని, బుద్ధిబలం, భుజబలం సంపాదించుకొని, శాసనబద్ధమైన ఆర్థిక ఉద్యమాలను నడపాలి. ప్రభుత్వం శాసనబద్ధమైన, సక్రమమైన ఉద్యమాలను కూడా సాగనీయకుండా, దౌర్జన్యంతో ఉద్యమాలను ఢీకొంటే, అప్పుడు ప్రభుత్వంపైనే వ్యతిరేకపోరాటం హింసతోగాని, అహింసతోగాని సాగించవలసిన అవసరం కలుగుతుంది

కాని కమ్యూనిస్టులు ఇలాంటి ఉద్యమాలను ప్రజలచే నడిపించలేకపోయారు. బార్డోలీ సత్యాగ్రహంలా ఎక్కడా ఏజమీందారీప్రాంతంలోనూ 'కంపెన్సేషన్'కు అడ్డుతగిలే ప్రతికూలఉద్యమాన్ని నడపలేదు. పారిశ్రామికుల లాభాలు సంఘాభ్యుదయానికే వినియోగపడాలి. పెట్టుబడిదార్లు కాదు, కార్మికులే ఉత్పత్తిదార్లు అని సామాన్యప్రజానీకానికి ప్రబోధమయ్యేట్టు ఎక్కడా చిహ్నమాత్రంగానైనా సమ్మె జరపలేదు. కార్మికులకు, బస్తీల్లోని మధ్యమతరగతి ప్రజకు, ఇతరశ్రమజీవులకు మధ్య పరిచయబాంధవ్యాలు ఏర్పరచలేదు. వీరంతా ఒక సంయుక్త కార్యాచరణకు పూనుకొనగలిగే ఏర్పాట్లు చేయలేదు. అలాగే పల్లెల్లో వ్యవసాయకూలీలు, చిన్నరైతులు, చేతివృత్తివాళ్లు, బీదలు విడిగాగాని, కలసిగాని ఏదైనా ఉద్యమాన్ని సాగించగలిగేశక్తిసామర్థ్యాలను చేకూర్చలేకపోయారు. రైల్వేకార్మికులు, పోస్టుపనివారు, బస్సుపనివారు, కలసి ఏకార్యక్రమంలోనూ పాల్గొనగలిగే పరిస్థితులు లేవు ఆర్థికంగా దారిద్ర్యంలో మునిగిఉన్నవారు ఎక్కువ కూలీకోసం, జీతంకోసం, పొలంకోసం, చదువుకోసం, వైద్యంకోసం పోరాడటమే కాదు అన్యాయం, ఆధిక్యతలేని సమసమాజాన్ని స్థాపించటం వారి ముఖ్య, విధిప్రేరత కర్తవ్యం ఇప్పుడు మనశ్రమజీవుల్లో ఈసంకల్పంగాని, సంకల్పశుద్ధిబలాలుగాని లేవనటం అతిశయోక్తికాదు. ఇంక కొత్త సంఘంకోసం ఊహాగానం చేసే మేధావంతులు ప్రకటనలద్వారా, వ్యక్తియుతమైన సాహసచర్యలద్వారా తమ ధర్మాన్ని, యుగధర్మాన్ని నెరవేర్చలేరు ప్రజలను మేల్కొల్పి, వారి వట్టిభుజబలాన్ని గుడ్డిగా వినియోగించకుండా, వారికి విషయకర్తవ్యజ్ఞానం కలిగించి, క్రమపద్ధతిన వారు గ్రామగ్రామాన ఉద్యమంలో పాల్గొనేట్టు చేయాలి.

విప్లవఆరంభానికి, సిద్ధికి అవసరమైన ఈ నిర్మాణాత్మకమైన పనులేవీ కమ్యూనిస్టులు చేయలేకపోయారు తమ అశక్తి, ప్రస్తుత వ్యవస్థయొక్క స్థిరత్వం గమనించి, నిస్పృహ చెందారు. ఆ నిస్పృహలోంచే వారి ఈ హింసావిధానం ఆరంభమైంది. ఏదో గుండు, తుపాకి, బరిసె పుచ్చుకుంటె నిరాయుధులు హడలిపోతారు. మనకు జైత్రయాత్ర ఆరంభమవుతుంది అనుకున్నారు. పోలీసుచర్యకు మునుపు నైజాం సంస్థానంలో ఆయుధాలు తేలిగ్గా దొరికినయ్ ఇంకేం? దళాలు, తుపాకులు, బరిసెలు వచ్చేస్తోంది...విప్లవం.

ప్రజలకు వీరి అరాచకంపట్ల సానుభూతి ఉంటె, దానికి నిదర్శనాలు కనబడాలి. కమ్యూనిస్టులు చేసే దోపిడీలు, హత్యలు

ప్రజలకు నచ్చితే, ప్రజలుకూడా గ్రామాల్లో ఈపాటికి వర్గయుద్ధానికి, అంతర్యుద్ధానికి దిగేవారు. కాని ఈ దౌర్జన్యం ప్రజలకు నచ్చలేదు నచ్చదు. వారికి ఆయుధాలు లేకపోవటమే కాదు ఇందుకు కారణం. పల్లెల్లో వర్గయుద్ధానికి నిజానికి పెద్దఆయుధాలే అవసరంలేదు ఉన్న సామగ్రితో సమరం సాగించవచ్చు. కాని ప్రజలకు ఈ హింసా విధానం నచ్చలేదు. వ్యక్తులను చంపి, డబ్బు దోచి, గ్రామాలపై దాడులు జరిపినంత మాత్రాన తాత్కాలికంగా స్థానికమైన ద్వేషం, అక్కసు తీరవచ్చు తాత్కాలికంగా దారిద్ర్య బాధ తీరవచ్చు. తాత్కాలికంగా తమశక్తి సాహసాలకు మురిసిపోవచ్చు కాని ఇప్పటి అన్యాయపీడితమైన సంఘం స్థానే సమసమాజం, క్రమబద్ధమై, శాంతిదాయకమైన సమాజం - పర్పడదు. సంఘనిర్మాతల సంకల్పం - ఒక లక్షాధికారిని చంపి, ఆ డబ్బు పదిమంది ఆరగించటం కాదు లక్షాధికార్లు, బిచ్చగాండ్రు లేని సంఘాన్ని సృష్టించడం. ఇది గ్రామప్రజకు క్షుణ్ణంగా తెలుసు. ఆకలితో, దారిద్ర్యంతో, దైన్యంతో గాండ్రిల్లుతున్నారు గదా, దౌర్జన్యపు రుచి చవిచూపిస్తే ఒక్కుమ్మడిగా సంఘంపై ప్రభుత్వంపై తిరగబడతారు అని అనుకోటం విద్యాధికవిప్లవవీరుల ఘోరభ్రాంతి రోజూ ఎక్కడో దోపిడీ చేసి, ఎవడినో చంపి, గంజినీళ్ళబదులు మనురాహారం తిని సుఖించాలనే సంకల్పం ఎవడికీ ఉండదు. పోనీ ఏదో దౌర్జన్యానికి ఇవ్వాళసిద్ధం. రేపటినుంచైనా ఈ ఒడుదుడుకులు ఈ రక్తపాతం, ఈ అన్యాయం. ఈ అసమత్వం లేని సంఘం ఏర్పడుతుందా అంటే, అలాంటిదేమీ కన్పించట్లేదు - ఈ కమ్యూనిస్టుఅరాచకంలో.

స్వతస్సిద్ధంగా మన ప్రజలు - మంచో చెడో - సాంఘికదౌర్జన్యానికి విముఖులు. వ్యక్తులుగా ఎంతైనా హింసచేయవచ్చు. కాని మొత్తంమీద, సంఘంగా మటుకు హింసకు ఇష్టపడరు. ఈ లక్షణం కమ్యూనిస్టులు గమనించలేదు. గమనించలేరు నాలుగేళ్లనుంచి ప్రాణాలకు లెక్కచేయకుండా, కమ్యూనిస్టులు ఆదర్శ—ఉన్మాదంతో ఎన్నో దారుణకృత్యాలు చేస్తున్నా, ప్రజలు వారివెంటబడి తమకు తోచినట్లు, చేతనైనట్టు ఏవిధమైనా హింసాచర్యలకు స్వతంత్రులు గా పూనుకోవట్లేదు

కమ్యూనిస్టుల సంకల్పబలంగాని, సాహసంకాని, ప్రాణమంటే ఉన్న నిర్లక్ష్యంకాని ప్రజలను ఈ నాలుగేళ్ళనుంచి పురిగొల్పలేకపోతున్నాయ్. కిందివర్గాలవారు కూడా కమ్యూనిస్టుల హింసాచర్యలకు తూగట్లేదు. తూగరు.

ప్రజలు తమ కార్యక్రమాలకు ఆమోదంగాని, మద్దతుగాని చూపించకపోయినప్పటికీ, ఈ నాలుగేళ్ళ విప్లవం వ్యక్తుల హత్యలు, దోపిడీలుగానే ఆరంభమై అంతమౌతున్నప్పటికీ కమ్యూనిస్టులు తాము పట్టిన కుందేలుకు మూడుకాళ్లే ఉన్నాయనే సంప్రదాయాన్ని విసర్జించలేకపోతున్నారు. వీరి మూఢత్వంమూలంగా దేశంలో సోషలిస్టుఉద్యమం దెబ్బతింటోంది.

ఇటీవల పార్టీనుంచి కొంతమంది రాజీనామా నిచ్చారు ఇస్తున్నారు. కాని పార్టీ అధికారులకు, తమకు మధ్య నున్న అభిప్రాయభేదా లెటువంటివో వీరు ఎక్కడా, స్పష్టంగా వ్యక్తం చేయలేదు. ప్రజాసేవే ధర్మంగా పెట్టుకొని, పార్టీగడప తొక్కిన వీరు, ఇప్పుడు తమదృష్ట్యా పార్టీఅధికారులు ఎలాంటి దోషభూయిష్ఠమైన విధానాన్ని అనుసరిస్తోందీ బహిరంగంగా చాటాలి. ఇది వారి కర్తవ్యం. కమ్యూనిస్టుపార్టీ విధానాలను ఖండించటమంటే, కాంగ్రెసునుగాని, ప్రభుత్వాలనుగాని భట్రాజులా పొగడనక్కరలేదు. కమ్యూనిస్టుపార్టీ అంటే ఏదో తమను సక్రమంగా ఉద్ధరించేసంస్థ అని నమ్మి, పార్టీలో చేరిన వందలమంది గ్రామస్థులకు ఇవ్వాళ దారీతెన్నూ లేకుండా ఉంటోంది.

ఇప్పుడు వారిలో కొంతమంది హఠాత్తుగా కాంగ్రెస్‌పత్రాలపై సంతకాలు చేసినా, కాంగ్రెస్‌వారిని చిత్తశుద్ధితో అనుసరించలేరు. పరిస్థితుల ప్రోద్బలంవలన, పైకి కమ్యూనిస్టులు కానట్టుగా కనబడ్డా, వారి మనస్సులో ఇంకా ఎర్రజెండా ఎగురుతూనేఉంది. వీరిని సక్రమంగా, దౌర్జన్యరహితంగా పార్టీవిధానం నుంచి విముఖుల్ని చేయాలంటే, పార్టీనుంచి రాజీనామా నిచ్చిన ప్రముఖులు, పార్టీవిమర్శకులు వారికి పార్టీలోపాలను స్పష్టంగా వివరించాలి ఈ సందర్భంలో పార్టీనుంచి రాజీనామా నిచ్చిన వారి దెక్కువ బాధ్యత.

కమ్యూనిస్టు కానివాడు ప్రజాద్రోహి, కాంగ్రెసుకానివాడు కమ్యూనిస్టు అనే ఈ రెండు అభిప్రాయాలూ మూఢమైనవే. కమ్యూనిస్టుపార్టీని విమర్శించేవారు, పార్టీనుంచి రాజీనామా నిచ్చేవారు కాంగ్రెసులో చేరనక్కరలేదు. చేరమని అనటం సబబూ కాదు. కాంగ్రెస్, కమ్యూనిస్టుపార్టీ విధానాలే మోక్షం కాదు. ఇంకోదారి ఉంది, తొక్కవచ్చుఅనేది ప్రజలకు ముఖ్యంగా పార్టీఅభిమానులైన ప్రజకు - కిందటి శాసనసభఎన్నికల్లో ఓటర్లలో 100 కి 12 మంది కమ్యూనిస్టులకు ఓటిచ్చారు - నచ్చజెప్పటం అవసరం.

ఇతర ప్రజాస్వామికసోషలిస్టుపక్షాల వారిపైనకూడ ఈ బాధ్యత ఉంది. పోలీసు అత్యాచారాలను నిర్భయంగా ఖండించవలసిందే. ప్రజలను కూడా కమ్యూనిస్టుపార్టీ విముఖులను చేయటానికి ప్రయత్నించాలి. ఇది అతిముఖ్యం.

ప్రజలుకూడా ఇటు, కమ్యూనిస్టులకు అటు పోలీసులకు మధ్య చిక్కుకొని, భీరువులై, సాక్షులుమాత్రంగా ఉండటమే కాక, కమ్యూనిస్టువిధానాలను, ప్రభుత్వపరిపాలనను స్పష్టంగా పరిశీలించుకొని, స్వతంత్రమైన వేరొకపంథా తొక్కగలిగాలి. నిజానికి ప్రభుత్వము మీదను, కాంగ్రెసుపట్లను ప్రజలకు తీవ్రమైన అసంతృప్తి ఉంది ఈ అసంతృప్తితో పొద్దు పుచ్చి, క్రియాశూన్యులై, నీరసించటం తమకే విఘాతం. కాబట్టి స్వతంత్ర ఆలోచనకు, కార్యాచరణకు ప్రజలు పూనుకోగలిగితేనే, ప్రజాజీవితం చైతన్యవంతమై వికాసం పొందగలదు.




# గానసభ

రచన : "శ్రీపతి" మూలం : "గ్రిమ్"

అనగా అనగా ఒక వూళ్లో ఒక చాకలి ఉండే వాడు. వానికో గాడిద ఉంది. గాడిద చాలా ముసలిది. ఏమాత్రం పని చేయలేక పోయేది. అనవసరంగా దీన్ని మేపడ మెందుకు, దీన్ని చంపేసి తోలు అమ్మేస్తే కొంచం డబ్బయినా వస్తుంది అనుకున్నాడు. యజమానిఅభిప్రాయం గ్రహించి గార్దభము. ఓరి నాయనోయ్! చంపెయ్యటమే-పట్టణం పారిపోయి నా కోకిలకంఠంతో గానసభలు చేసి డబ్బు సంపాదిస్తాను అనుకొని ఆవేళ రాత్రే ఉడాయించింది. అలా వెళ్తూ ఉంటే ఒకచోట ఒకముసలికుక్క కూర్చుని కుయ్యో మొర్రోమని ఏడుస్తూంది. "ఏందుకోయ్! కళ్ళనీళ్ళు పెట్టుకుంటావ్! నీ కేంలోటు" అని అడిగింది గార్దభం. "ఆ! అంతా లోటే. లేకపోతే ముసలిదాన్నయిపోయి వేటకుపనికి రానని యజమానిచేత చావు దెబ్బ లెందుకుతింటానూ"అంది కుక్క "ఓస్! ఈ మాత్రం దానికేనా. పట్టణం పోతున్నా నాతో రా! నేను గానం చేస్తాను, నువ్వు తబల వాయిద్దువు గాని" అంది గాడిద. "ఓ! సరే! అంతకంటేనా" అని గాడిదతో ప్రయాణమైయింది కుక్క. అలా కొంతదూరం పోయేసరికి ఒకచోట ఒక పిల్లి కూర్చుండి విచారంతో ఏదో ఆలోచిస్తోంది. "ఏం! పిల్లి మామా! అలా వున్నావ్!"అని అడిగింది గాడిద. "ఏం చెప్పనోయ్! ముసలిదాన్నయిపోయాను. గోళ్ళన్నీ అరిగిపోయాయి. ఒక్క ఎలుకా నా చేతికి చిక్కదు. నాలుగురోజుల్నుండి ఆహారం లేదు" అంది విచారంతో. "అలా ఆయితే మాతో వచ్చేయ్! మేము పట్టణం పోయి గొప్ప సంగీతవిద్వాంసులం అవుతాం" సరె నని పిల్లి వాళ్లని వెంబడించింది. అలా మరికొంత దూరం పోయేసరికి ఒక కోడి ఒక ఇంటిగోడమీాద నిలబడి ఊరికే "కొక్కొరోకో"యని అరవడం మొదలుపెట్టింది. "ఎందుకోయ్! అలా గొంతు చించుకుంటావ్ - నీ కేం లోటు చెప్పు"అంది గాడిద. "ఏం చెప్పేది. నా యజమాని ఇంటికి రేపు చుట్టాలు వస్తారట. వాళ్లకు నన్ను ఆహారంగా చేస్తారట. నే నెవరితో చెప్పుకొనేది"అంది.!

"ఓహో దానికేనా! మేం పట్టణంపోయి గొప్ప సంగీతవిద్వాంసుల మవుతాం. మాతో వచ్చేయ్." అంది గాడిద. "ఓ! సరేనని కోడి కూడా వారితో బయల్దేరింది



అలా కొంతదూరం పోయేసరికి ఒక అడవి తగిలింది. ఇక ముందుకు పోలేక గాడిద ఒక చెట్టుక్రింద కూలబడి "ఇక ముందుకు పోలేను. బాగా అలసిపోయా. ఈ రాత్రి ఇక్కడే గడుపుదాం" అంది. సరేనని వప్పుకున్నాయ్ మిగతవన్నీ. కుక్కకూడా గాడిదప్రక్క కూలబడింది. పిల్లి చెట్టెక్కి కొమ్మమీద కూర్చుంది. కోడి కూడా చెట్టు పైకొమ్మ కెక్కింది. చుట్టూ చూచింది. దూరంగా ఏదో వెలుగు కనిపించింది. "ఏమయ్యోయ్! అదిగో, ఈ చెట్టుకి కొంచెందూరంలోనే వెలుగు కనిపిస్తోంది. అక్కడ ఏదో ఇల్లు వుండి ఉండాలి. అక్కడకు పోదాం రండి" అంది కోడి. సరేనని అన్నీ కోడిచెప్పిన వైపు బయల్దేరి వెళ్ళాయి. వెళ్ళగా ఒక ఇల్లు కనిపించింది. అది అడవిదొంగల యిల్లు. ఆయింట్లో ఎల్లప్పుడూ బోలెడన్ని తినేపదార్థాలు డబ్బూ వుంటాయ్. "ఆయింట్లో ఎవరో ఉన్నట్లున్నారే" అంది మార్జాలం. "అదిగో ఆ ఎత్తైనకిటికీగుండా చూద్దాం" అంది గార్ధభం. గాడిద గోడకి కాళ్ళు ఆన్చి నిలబడింది. గాడిదవీపుమీద కుక్క నిలబడింది. కుక్కవీపుమీద పిల్లి దాని నెత్తిమీద కోడి నిల్చున్నాయ్! అప్పుడు కోడి ఆ కిటికీలోనుండి తొంగిచూచి "ఈ యింట్లో ఆరుగురు మనుష్యులు ఒక బల్లచుట్టూ కూర్చుని ఏవో ఆరగిస్తున్నారు" అంది. "అయితే! వాళ్ళని వెళ్ళగొట్టడం ఎలా?" అంది కుక్క. "దానికేం!, అందరం ఒక్కమారే సంగీతం ప్రారంభిద్దాం-అప్పుడు వాళ్ళంతా పారిపోక ఏం చేస్తారు" అంది పిల్లి. "ఊఁ! సరే ఒకటి ... రెండు...మూడు..." గాడిద, కుక్క, పిల్లి, కోడి "సా...పా. .సా" అని ఒకటే కాకిగోల. ఈ సంగీతం వినేసరికి లోపం వున్న దొంగలు "ఓరి బాబోయ్ దెయ్యాలూ, భూతాలూ మనమీద గండెత్తి వచ్చాయిలాగుంది" అని ఎక్కడివి అక్కడ వదిలేసి ఒకటే పరుగు పుచ్చుకున్నారు.

నలుగురు స్నేహితులూ తక్షణం గృహప్రవేశం చేశారు. మార్జాలం తమ కనువైన చోటు కోసం ఇల్లంతా తిరిగి గాడిపొయ్యిలో తోక ముడుచుకుని కూర్చుంది. కుక్క గదిగుమ్మం వద్ద సాగిలపడింది. గాడిద ఆ గదిప్రక్క వసారాలో పడుకుంది. కోడికి తెగ అనుమానం. అందుచేత ఎవ్వరైనా వస్తున్నారేమో నని ఇల్లెక్కి చూస్తూ కూర్చుంది. గాలికి లోపలనున్న దీపం ఆరిపోయింది. దూరంగా పారిపోయిన దొంగలు "ఆదయ్యాలు వెళ్లిపోయినట్లున్నాయి" అనుకొని తమలో ఒకడిని చూచిరమ్మని పంపారు. వాడు వెళ్ళి ఇంట్లో ప్రవేశించాడు. దీపం ఆరిపోయింది. పొయిలో పడుకున్న పిల్లి మెలకువగానే యుంది. ఆ ఎర్రగామెరుస్తున్న పొయ్యిలోని పిల్లికళ్ళు చూచేసరికి నిప్పనుకుని జేబులో చుట్ట తీసి కాల్చుకోబోయాడు దొంగ. పిల్లి ఊరుకుంటుందా! మీది కెగిరి మొహమంతా రక్కి రక్కి వదిలిపెట్టింది. గదిలోనుండి పారిపోబోయేసరికి గదిగుమ్మం వద్దనున్న కుక్క, దొంగ కాలిమీద ఒక్క కాటువేసి వదిలిపెట్టింది. ఈ గందరగోళం అంతా విన్న గాడిద లేచి వెనకకాలితో దొంగనడ్డిమీద ఒక్కటి వడ్డించింది. ఈ కాట్లతోనూ రక్కులతోనూ దెబ్బలతోనూ దొంగ బెదిరిపోయి ఇల్లువదలి పారిపోతుంటే కోడి "కొక్కరో కో" అని అరిచింది అది ఒక దెయ్యం అనుకుని ఒక్క క్షణంలో తన వాళ్ళను జేరుకుని వాళ్ళతో యిలా చెప్పాడు. "ఆ యింట్లో నలుగురు రాక్షసులున్నారు. నేను వెళ్ళగానే శూర్పణఖలాంటి రాక్షసి నా మొహం అంతా రక్కేసింది. నేను వచ్చేస్తుంటే నల్లటి భూతం కత్తితో నా కాలుమీద కొట్టింది. వసారాలోనికి పోగానే ఇంకొక బండరాక్షసుడు తన గదతో నడ్డిమీద కొట్టాడు పరుగెత్తుకుని మీవద్దకు వచ్చేస్తుంటే ఇంటిపైనుండి ఇంకో సాతాను "వాడిపీక కొయ్యరోయ్" అని కేకలేసింది. ఇంక మనం ఆయింటికి పోవద్దు. పోదాం రండి" అని శాశ్వతంగా, ఆయింటిని వదిలేసి వెళ్ళిపోయారు. ఆయింట్లో నున్న భోజనపదార్థాలు మస్తుగా తింటూ శాశ్వతంగా మనం ఇక్కడే వుండిపోదాం." అనుకున్నారా నలుగురు సంగీతవిద్వాంసులూ. రోజూ ఆ యింట్లోనుండి గొప్పసంగీతం వినిపిస్తుంది ఆదారిని పోయేవారికి. కాని అక్కడికి పోయేటంత ధైర్యం ఏదీ ?

---



బాలానందం:

# "ఓ! అదినాకెందుకు తెలియదూ!!"

శ్రీమతి చెరుకుపల్లి ఇందిరావతి

ఒక గ్రామంలో వెంకయ్య అనే పేరుగలవాడు ఉండేవాడు. అతనికి రాము అనేపేరుగల కుమారుడున్నాడు. అతని కొక పెద్దజబ్బు పట్టుకొంది. జబ్బుఅంటే ఏదైన జ్వరము బాపతు అనుకునేరు. కాదు, వాడు ప్రతిదీకూడా నాకు తెలుసు, నాకు తెలుసు అని అనేవాడు. ఎవరైనా ఒక క్రొత్తవిషయాన్ని చెప్పబోతే, అది తాను తన జీవితంలో ఎప్పుడూ కనీ వినీ ఎరుగక పోయినను మధ్యలో లేచి "ఔనౌను... నాకెందుకు తెలియదూ"అని గలభా చేసేవాడు. సొంతం చెప్పనిచ్చేవాడు కాడు. అదో అలవాటై పోయింది. తలిదండ్రులు ఆ చెడ్డ అలవాటును మానుకోమని అన్ని విధాలా చెప్పిచూసారు. తన భావి జీవితంవరకూ ఆ అలవాటు వెన్నంటి అష్టకష్టాలు పాల్జేస్తుంది అనికూడా హెచ్చరించారు. కాని ఫలితం శూన్యం, నిరాశచెందారు.

ఒకరోజు ఎవరో ఒకడు వెంకయ్య వద్దకు వచ్చి, ప్రక్కగ్రామంలో ఎవరో ఒక తెలివిగల డాక్టరున్నట్లును, అతడు యిటువంటి చెడు ప్రవర్తనగల పిల్లలను సక్రమమయిన మార్గములో పెట్టడానికి ప్రవీణుడని చెప్పాడు.

సరే అని వెంకయ్య రామూని ఆ డాక్టరువద్దకు తీసికెళ్ళి ఆ వున్న జబ్బు కాస్తా సవిస్తరంగా మనవి చేసుకొన్నాడు. "అలాగయితే వాడిని యిక్కడనే వదిలిపెట్టండి" అని డాక్టరు రామూవంక ఎగాదిగా చూసి మళ్ళీ వెంకయ్యతో "మళ్ళీ మీరు రేపురావచ్చు" అని చెప్పాడు.

"రేపే! యింతత్వరలోనే మార్పు తేగలరా" అన్నాడు వెంకయ్య. "అవును-రేపటిలోనే" అని చెప్పి రామూవైపు తిరిగి "అంతేనా" అన్నాడు డాక్టరు:

"ఔనౌను! నాకెందుకు తెలియదూ" అని గుక్కతిప్పకుండా అన్నాడు. రాము "కాస్త జాగ్రత్తగా చూడండి బాబూ" అని చెప్పి వెంకయ్య వెళ్ళాడు

డాక్టరు: రామూ, యిటు చూడమ్మా - నీవు చాలామంచి వాడివికదూ-

రామూ అవునవును-నాకెందుకు తెలియదూ.

డాక్టరు: నీకు మోటబావిచక్రం త్రిప్పడం వచ్చుకదూ?

రామూ: అయ్యో, నాకెందుకు రాదూ.

"భేష్" అని తిన్నగా భావిదారి చూపించారు డాక్టరుగారు. అదొక పెద్ద భావి. దానికి తగ్గదే ఆ బొక్కెన. చుట్టూ పెద్దతోట. ఆ తోటకు నీరుపెట్టాలి రాము. చక్రం త్రిప్పగా, త్రిప్పగా అతికష్టం మీద పైకి వస్తుంది బొక్కెన. నీరన్ని పైన పారబోసి మరల లోనికి పోతుంది. రామూ చక్రాన్ని త్రిప్పాడు, త్రిప్పాడు. లెక్కలేదు. చేతులు బొబ్బ లెక్కుతున్నాయి. అట్లాగే ముక్కుతూ మూలుగతూ లాగుతున్నాడు. కాని యిక లాభం లేకపోయింద. చమట కారిపోతుంది. సొక్కి, సోలిపోయి పడివున్నాడు. భోజనం వేళైంది. డాక్టరుగారి భార్య వంటింట్లో ఏదో తాలింపు వేస్తున్నది. తిరగమూత వాసన ఘుమాయిస్తున్నది. ఎప్పుడా, ఎప్పుడా అని లొట్టలు వేస్తున్నాడు.

డాక్టరు వచ్చి యింకా చాలులే రమ్మనమని పిల్చి అతని చేతికి ఒక ఉత్తరం యిచ్చి "ఇందులో ఏమి రాసుందో తెల్సునా" అని అన్నాడు.

"తెలుసు, తెలుసు, నాకెందుకు తెల్యదూ" అన్నాను.

"అలాగైతే ఈ ఉత్తరాన్ని నాభార్యకు చూపించు" అన్నాడు.

* * * * * *

రామూ తిన్నగా వంటింటిదోవ పట్టాడు. దగ్గర కొచ్చే కొద్దీ తాలింపు వాసన ఎక్కువౌతుంది. ఆకలిని రెచ్చగొడ్తుంది. లోనికి ప్రవేశించి ఆమెకు ఉత్తరం అందిచ్చాడు

ఆమె ఉత్తరాన్ని చూచి "యిందులో ఏమి రాసుందో తెలుసా" అని అన్నది.

ఆ! తెలుసు, తెలుసు "అని అన్నాడు రాము

"అయితే నీవు ఈరోజు భోజనం చేయకుండానే, తేలికగా పండు కోవాలె నని యిందులో ఉంది. అర్థం తా నీకు తెలుసుగా, నే జెప్పడ మెందుకు" అని అన్నది.

"భో...ను-ని జ మే-నా కెందు ...కు-తెలి...యదు." అని హీన స్వరముతో-నిదానంగా అన్నాడు.

బ్రతుకు జీవుడా అని పక్క జేరుకున్నాడు గాని డొక్క-మాడడం ప్రారంభించింది. నిద్ర పట్టలేదు. బయట కొచ్చి చుట్టుప్రక్కల కలయ జూచాడు. ఎవ్వరూ కనిపించలేదు. దూరానా తోటలో ఒక్క తోటమాలిమాత్రము ఏదో చేస్తున్నాడు. అచ్చటకు తిన్నగా బయలుదేరాడు.

"ఎందు కిలా వచ్చావు" అని అన్నాడు తోటమాలి.

"ఆకలి వేస్తుంది-ఏమైనా తిందామని" అన్నాడు రాము.

"సరే అయితే అదుగో అటు పోయావంటే, పండిన యాపిలు పండ్లు మాత్రం కనబడతాయి" అని వ్రేలితో చూపించుచూ "దోవలో ఏముందో తెలుసుగదూ" అని అన్నాడు.

"ఆ-తెలుసు, తెలుసు" అని ఆదుర్దాతో ఒక్క గంతువేసి పరుగెత్తాడు. కాని పరుగెత్తిందే తడవుగా త్రోవలోవున్న పెద్ద బురద గుంటలో దూకాడు. ఒళ్లంతా బురదచిందులు. నడుంలోతు లో యిరుక్కున్నాడు. పెద్ద కేక వేశాడు. చుట్టప్రక్కల వాళ్ళంతా పోగయ్యి వాడిని చూచి పకపలు నవ్వారు. తోటమాలి కూడా పరుగెత్తుకుంటూ వచ్చి బయటికి తీసాడు.

"యిలా ప్రవర్తించడం, చాలా ప్రమాదమని తెలుసుకున్నావా రామూ" అని అంటూ డాక్టరు వచ్చి "అలా ఏదీ తెలియక పోయినా, తెలుసునని నటించేవాళ్ళందరి చుట్టుప్రక్కల యిలాంటి అగాధాలుంటాయి తెలుసునా" అన్నాడు డాక్టరు. ఈ మాటలు రామూహృదయంలో బాగా నాటుకున్నాయి. గతాన్ని ఒక్కమారు విస్మరించుకున్నాడు. ఎముకలు పిండి అయ్యేటట్లు బండచాకిరీ-ప్రేగుల అర్తనాదాలు (భోజనం పెట్టకపోతే) నడుములోతు బురద గుంటలో నిలువుజీతం-పాడువాసన-పదిమంది పకపకలు. తలకాయ క్రిందకు వాల్చుకొని "ఏమో-ఎవరికితెలుసు అంతటా అగాధాలున్నాయి కాబోసు"అనుకున్నాడు.

రెండవరోజు డాక్టరు మళ్ళీ వచ్చి"రామూ, నీకు చెట్లు నరకడం వచ్చుగదూ" అని అన్నాడు.

"అమ్మ బాబోయ్-నాకేమీ తెలియదండీ" అన్నాడు.

* * * * *

అప్పటినుండీ రామూ మరెప్పుడూ ఏ విషయమైనా సరే సమగ్రంగా పరిశీలించనిదే త్వరపడి సమాధాన మిచ్చేవాడు కాదు. ఒకవేళ ఎవరైనా "యింత ఆలస్యంగా చెప్పెద మెందులకోయ్" అని అంటే "చుట్టుప్రక్కల ఏమైనా అగాధాలున్నాయేమో నని భయం" అనేవాడు.

గేయం :

అజంతా

# నాడూ-నేడూ

హిందీ మూలం : శ్రీ యం. హీరాలాల్‌రాయ్

అనువాదం : శ్రీ ఊటుకూరు. రంగారావు

అమూల్యదివ్యసౌందర్యం.
అతివాస్తవికప్రకృతి.
మానవాతీతకల్పనాశక్తి
నవోత్తేజకరభంగిమలు
అజంతాగుహాభ్యంతరంలో
నిబిడీకృతమై వున్నాయి.

పోటుకొండరాళ్ళని కరిగించి,
శిలాప్రతిమల్లా అచ్చు పోసిన
మహాచాతుర్యం
ఆజంతాసౌందర్యం.



ప్రతి దృశ్యం, ప్రతి భిత్తికాచిత్రం
అతికోమలతాసమన్వితం.
ఇది ప్రపంచకళారంగం.
ఇది భారతజీవనాకాశం.

ఈ నిర్జీవశిలామూర్తుల్లో
ఎంతో సౌందర్యతేజం,
ఎంతో సహజగాంభీర్యం,
ఘనభారతకళాకౌశలం,
మణిదీపాల్లా మెరిసే చుక్కల
ఆకాశాన్నంటుతోంది,

శిలాప్రతిమల స్నిగ్ధసౌందర్యం
స్వర్గలోకాప్సరఃకన్యల్ని
ధిక్కరించివేస్తూన్నది.
ఓహో...!
ఇదొక మహాకళాసముద్రం.
ఇది నవసౌకుమార్యశిల్పం.

భావనాప్రపంచాన్ని, వి
స్మరింపజేసే మహానుభావత్వం.
స్వర్గప్రాంతరమణీయతని
అణగద్రొక్కిన అతివిలాసం.
గతభారతకళాచరిత్రకి,
యుగయుగాలకైనా, చెదరని
జీవం పోశాయి.
భావనాలయాలైనాయి,

అంతులేని కోమలసౌందర్యాన్ని,
ఇంత గొప్ప కళాకౌశలంతో,
పెంపొందించిన ఈ చాతుర్యం,
ఈ భూలోకస్వర్గనిర్మాణం,



ఈ మహాకళావేతృత్వం
వీటన్నిటి సృష్టికర్త
ఎవరో ఒక మానవుడే.

శిథిలశిలల్లో నవకోమలతనీ,
పాడుబండల్లో పవిత్రతనీ,
ప్రపంచంలో కళ్యాణరంగాన్ని,
సృష్టించిన, ఆ
మానవహస్తాలే,
నేడు,

ఈ సుందరవిలసితవిశ్వాన్ని,
ఈ భూతలస్వర్గాన్ని
పడద్రోయగ చూస్తూన్నై.
పడద్రోస్తూన్నై కూడా.
మరి, వీరంతా మానవులా?
వీరంతా ఘోరదానవులా ?

నాడు
పవిత్రమానవశక్తులు
బండలెన్నిటినో మలిచి,
ప్రతి అంగళప్రదేశంలో—
నవ, ప్రపంచాన్ని సృష్టించినై



నేడు
ఆ మానవమహాశక్తులే,
ఆశాద్వేషాలకి లోనై,
ఈర్ష్యాక్రోధావరమై,
ప్రతి అంగుళం ప్రపంచాన్ని
రక్తార్ద్రం చేస్తున్నాయి.
ఎంతో భేదం
ఎంతో భేదం

ఇది, మరో దౌర్భాగ్యప్రపంచం.
కానేకాదా ప్రపంచం.
ఇది అర్థంకాని అసహ్యం,
అది అనూహ్యమైన నిశ్చలత్వం.
ఎంతో భేదం
ఎంతో భేదం

ఆనా డా మానవలోకంలో,
అంతా శాంతికాముకులే,
అంతా సౌందర్యహృదయులే,
ఈ నా డీ మానవనరకంలో
ఎవరైనా ద్వేషప్రియులే.

నాలోతుహృదయంలోంచి,
అతిసున్నితమౌ ధ్వని
వినవస్తూన్నది.
భేదిస్తూన్నది శూన్యాన్ని,
ఆ మహాదివ్యప్రపంచంలో,
నే నొక శిలామూర్తినై,
అజంతాగుహాంతర్భాగంలో
హాయిగా, ఏదో మూలన నివసిస్తే

ఈ కలుషితవిధ్వంసకవిశ్వంతో
ఏమాత్రం జోక్యం లేకుండా
నిశ్చింతతో, నిరాలోచనతో
నిర్మలానందం అనుభవిస్తాను.
నవ్యసౌందర్యజగత్తులో,
నవజీవనగేయామృతాన్ని
నదిగా ప్రవహింప చేస్తాను,
వ్యథలంటే ఏమో తెలియని
హృదయంతో జీవిస్తాను,
శూన్యాకాశపథంలో, నా
కవితాకాంతులు విరజిమ్మేస్తాను,
వికసించిన జలజాగ్రభాగంలా,
దరహాసవదనుణ్ణవుతాను.

నూతనజగత్సృష్టి జేసి
అసామాన్యమైన ప్రణయగీతాన్ని
ఆలాపిస్తూ, నృత్యం చేస్తూ,
ఆనందంతో, మైమరుస్తాను.

నా శిలాజీవితాధ్యాయాల్ని
ఈ శిలామూర్తులకి విన్పిస్తూ,
నిలువున కొల్లగొడతాను
సంతోషధనాగారాన్ని.

నా అమూల్యగేయాలాపనతో,
ఈ నిర్జీవప్రతిమల్లో,
నవచైతన్యం సృష్టిస్తాను,
ఈ దుష్టస్వాప్నికలోకాన్ని
చీకటిలో తోసేస్తాను.

---



# కోహినూరు

భారతదేశము నిజముగ వసుంధరయే. విశ్వవిఖ్యాతిగన్న వజ్రములు దాదాపు అన్నియు నిచట బుట్టినవే. అందును ఆంధ్రమాత రత్నగర్భ; కృష్ణా, గోదావరీ, తుంగభద్రా జీవప్రవంతులతో నొప్పారుచు సుప్రసిద్ధవజ్రాలగన్నతల్లి. గ్రేటుమొగలు, రీజెంటు లేక పిట్టు, హోపు, గోల్కొండ్, కోహినూరవజ్రములు ఆంధ్రదేశపు పంటయే.

ప్రపంచప్రఖ్యాతి, చరిత్రవిఖ్యాతి గన్న కోహినూరు పేరువిననివా రెందరు అందచందములలోను, విలువలోను దీనిమించినవజ్రము లోకంలో మరొకటిలేదు దీని యఖండతను రోజెట్ ధసారసులో వర్ణించాడు. నాల్గు, ఐదు వేల సం॥ల క్రితం కోహినూరు గోదావరిలో దొరికిందని, మహాభారతవీరులలో నొకరు దీని ధరించిరని ప్రతీతి. తర్వాత 14 వ శతాబ్దము వరకు నిది మాల్వామహారాజుల యధీనంలో నుండిన క్రీ. శ. 1304 సం॥లో అల్లావుద్దీను ఖిల్జీ మాళవ రాజును యుద్ధంలోగెల్చి, యీయుజ్వలవజ్రమును గ్రహించాడు. రెండుశతాబ్దములు తర్వాత మొగలాయీ రాజ్యస్థాపకుడు బాబరు కోహినూరును సంపాదించిన విషయమును తనస్వీయచరిత్ర – బాబరు నామా – లో 1526 సం॥ మే 14 వ తేదీన యీక్రింది విధముగ లిఖించాడు. "గ్వాలియరు రాజు విక్రమజిత్తు నూరేండ్లకుపైగా పాలించాడు ఇబ్రహీము యోడిపోయిన యుద్ధములో విక్రమజిత్తు వధింపబడ్డాడు. అప్పుడు విక్రమజిత్తుకుటుంబము, ఇతరనాయకులు ఆగ్రాలో నున్నారు హుమయూనను జూడగనే విక్రమజిత్తుపక్షమువారు పలాయనమగుటకు ప్రయత్నించిరి, వాని కక్షువారిచే బందీకృతులైర హుమయూను వారిదోపిడికి అనతియియ్యలేదు. కాని ఖైదీలు తామే హుమయూనకు పేష్కసుక్రింద బహూకృతిగ నిచ్చిన నమూల్యాభరణములు, వజ్రములలో సుల్తాను అల్లావుద్దీనుయొద్ద నున్న ప్రసిద్ధవజ్రమున్నది వజ్రశోధకుడు దాని విలువ ప్రపంచమున దినమునకగు ఖర్చులో సగమన్నాడు. దాని బరువు 8 మిష్కెల్స్ నారు దానిని హుమయూను పేష్కసుగ నిచ్చిన, తిరిగి నే నతనికి దాన్ని కానుకగ యిచ్చాను"

రెండుశతాబ్దములు యీ వజ్రము మొగలుసామ్రాజ్యములో నిల్చింది. ఔరంగజేబు దానిని తన మయూరసింహాసన మలంకరించిన నెమలికొక కన్నుగ పొదిగించెను. పర్షియా సామ్రాట్టు నాదిర్‌షా మనదేశంపై దండెత్తివచ్చి 1739 లో ఢిల్లీని బట్టుకొనువరకు నీ వజ్రము మొగలాయీ కోశాగారములో ప్రథమస్థాన మాక్రమించింది ఢిల్లీలో నాదర్‌కు దొరకిన సొత్తులలో నీ వజ్రములేదు. నెమలి గద్దె దొరకినను, నెమలి వజ్రనేత్ర మదృశ్యమయ్యెను. పరాజితుడైన

శ్రీమతి వారణాశి యశోదాదేవి

మొగలుచక్రవర్తి మహమ్మదుషా యీ వజ్రమును తాను యెప్పుడు ధరించు తలపాగలో దాచికొనెనని నాదిర్, జనానాస్త్రీలనుండి తెలిసికొన్నాడు అందువల్ల నాదిర్ మహమ్మదుతో సంధిచేసుకొని రాజ్యము తిరిగి యిచ్చుటకు నిశ్చయించి, మొగలురాజ్య పునఃప్రతిష్ఠామహోత్సవ సందర్భములో స్నేహానూచనగా తలపాగాలు మార్చుకుందామన్నాడు మొగలు సామ్రాట్టుతో మహమ్మదు తప్పనిసరిగ తన పాగ నాదిర్‌కిచ్చి, యతని పాగ తాను ధరించాడు ఈ మాయోపాయమువల్ల నాదిర్‌షా యీ రత్నమును సంపాదించాడు.

నాదిర్‌షా శిబిరమునకు వెళ్లి తలపాగను జాగ్రత్తగా మడతలు విప్పగా లోనుంచి వజ్రము బయటకు దొర్లింది. దాన్ని బ్రహ్మానందముతో రెప్పవాల్చక చూచి మహాశ్చర్యంతో కోహినూర్ యని బిగ్గరగా యరచెను. కోహ్ అనగా పర్వతము నూర్ అంటే కాంతి లేక దీపము కాన కోహినూర్ అనగా వెలుతురుకొండ. ఈ పేరును బట్టి యీ వజ్రము ప్రజ్వలత, భాస్కరత్వము ధగధగ యూహించవచ్చు. నాదిర్ చకితుడై బెట్టిన పేరు యీ రత్నమునకు శాశ్వతముగ నిల్చింది.

నాదిర్ కోహినూరును పర్షియాకు తీసికొనివెళ్లెను. అప్పటినుండి వజ్రమునకు కష్టములు ప్రారంభించాయి రాజ్యంలో నశాంతి ప్రబలెను. ఎప్పుడు హత్యలు జరుగుచుండెను, నాదిర్ తన జీవితాంతము వరకు వజ్రమును ఖొరస్సానులో తనదగ్గర భద్రపర్చుకొన్నాడు. శత్రువు లెవరో నాదిర్‌ను చంపివేయగా కోహినూర్ నాదిర్ మనుమడగు షారుక్‌కు జెందింది. షారుక్ యీ వజ్రమునంతకష్టపరంపరలకు కారణమని కనిపెట్టాడు ఇతడు మెషాపట్నమున కధిపతి. ఆగామహమ్మదు యను చిన్న ప్రభువు షారుక్ నుండి కోహినూరును, ఇతర వెలలేని యాభరణములను దొంగిలింప నిశ్చయించి, యొక కుతంత్రమువల్ల మెషాపట్నమును బట్టుకొన్నాడు. షారుక్‌ను తన సొమ్ముల నిచ్చివేయ నాజ్ఞాపించాడు. షారుక్ తాను మును పే యిచ్చివేసితి నన, యీ మాటలు విశ్వసింపక మహమ్మదు అతని హింసలు బెట్టదలుబెట్టాడు. షారుక్ భయపడి కోహినూరు. మరొక ప్రసిద్ధమాణిక్యము తప్ప, తక్కిన వజ్రాలన్ని యిచ్చివేశాడు. మహమ్మదు షారుక్ తల గొరిగించి, మీద సున్నపు కిరీటము బెట్టి యందులో మరగిన నూనె బోయించి బాధించాడు అప్పుడు షారుక్ కోహినూరు తనదగ్గర లేదని, మాణిక్యము మాత్రము యిచ్చివేసెను. ఈ విపరీతబాధలవల్ల యతని ఆరోగ్యము చెడిపోయింది చివరకు 1751 లో దుర్రాని, ఆఫ్ఘనుసామ్రాజ్య నిర్మాతయగు అహ్మదుషా లనకు చేసిన సహాయమునకు కృతజ్ఞతాసూచకముగ షారుక్ కోహినూరను అతని కర్పించాడు.

అహ్మద్ మరణానంతర మతని పుత్రుడు తైమూరుషా కోహినూరును బొంది, 1793 లో తన యవసానకాలమున కుమారుడు షాజమాను కిచ్చాడు షాజమాను దీనివల్ల యాపదల పాలయ్యెను తమ్ముడు షాషుజావుల్ ముల్కు అన్నను రాజ్యభ్రష్టుని జేసె, బైగుటలో బెట్టి కళ్లు బోగొట్టాడు షాజమాను కోహినూరు నుబందిఖానా గోడలో పూడ్చిబెట్టగా, కాలక్రమమున

(40 వ పేజీ చూడుడు)

# నవ్వించి ఏడిపించే పసిపాప

నిజానికి మీకు చాలా తెలుసు — మీ పాపను గురించి. మీకు అంత తెలుసని మీరే అనుకోరు. అందుకు మీ సంకోచమూ సందేహాలే కారణం. బిడ్డని సంరక్షించడంలో తల్లికి ఎంత సమర్థత ఉంటుందో ఆమెకే తెలియదు. అప్పుడప్పుడు మాత్రం తటుక్కున ఈ సత్యం తెలిసివస్తుంది. ఒక్కొక్కప్పుడు బిడ్డ గుక్కపట్టి ఏడుస్తుంటాడు. ఎంత సముదాయించినా తిక్క వదలదు. పదిమంది పది ఉపాయాలు చెప్తారు. కాని అవేవీ పని చెయ్యవు. చివరికి తల్లికి తోచిన ఉపాయమే పనిచేస్తుంది. సర్వసామాన్యంగా తల్లికి తోచే ఉపాయాలే సరైనవిగా ఉంటాయి. పాశ్చాత్యదేశాల్లో వైద్యులు అనేక సంవత్సరాలుగా పరిశోధన చేసిచేసి క్రమంగా తెలుసుకుంటున్న దేమిటంటే, తల్లికి తండ్రికీ సహజంగా తోచే ఉపాయాలే అన్నిటికంటే మేలని. తల్లిదండ్రులకి అవసరసమయాల్లో అంతర్వాణి పలుకుతుం దంటారు. విశ్వాస బలంతో సంరక్షణచేస్తే, అంతకు మించిన రక్షణ బిడ్డల కుండబోదు. మొదట పొరపాట్లే చెయ్యనీయండి అనుభవంకంటె మించిన గురూపదేశం లేదు.

తొలిఫలాన్ని చూసుకుని తల్లి మొదట మురిసిపోతుంది. కాని క్రమక్రమంగా నీరసం వల్లనో, లేక ఇంటిచాకిరీ అధికం కావడం వల్లనో తల్లికి విసుగు, చికాకు అధికమౌతాయి. పాపకి ఉదయం నీళ్లుపోసినతరవాత పాలకు పేచీ పెట్టేవేళకి అటు వేళకి వంట తెమలక ప్రాణం విసిగిపోతుంది. మధ్యాహ్నం భోజనాలైన తరవాత పాపను చాపమీద పడుకో పెట్టి విశ్రాంతి తీసుకునేవేళ పాప ఆటపాటల ముచ్చట్లు చూస్తుంటే లోలోన ఆనందం అతిశయిస్తుంది. రాత్రివేళ పాపను జోకొట్టుతున్నప్పుడు ఆచిన్నముఖం చూస్తుంటే భవిష్యత్తును గురించి అనేకతలపులు ముసురుకొస్తాయి. ఒక్కొక్కప్పుడు ఏదో తెలియని బెంగగుండెకు గుబులు కలిగిస్తుంది. ఇవన్నీ తల్లికి, ముఖ్యంగా తొలిబిడ్డను కన్న తల్లికి సహజమే. నూరేళ్ల బ్రతుకులోని వెలుగు నీడలు, ఆశనిరాశలు సుఖదుఃఖాలు, తీపి చేదులు కలిసి పసిపాపను పెంచే తొలి అనుభవంలోనే సిద్ధిస్తుంది. కాని ఇందులోని మాధుర్యాన్ని అందరూ అనుభవిస్తున్నా, అందరూ గ్రహించలేకున్నారు.

పసిపాప ఆడుతూ పాడుతూ ఆరోగ్యంగా పెరిగి ముద్దులు తీర్చాలంటే, తల్లీ తండ్రీ సహనంతో చిరునవ్వుతో అవసర



మైనంతవరకే శ్రద్ధవహించి పెంచాలి. సంతోషం మరీ అతిశయిస్తే అహం హద్దు మీరి బిడ్డ మనస్తత్వం ముందుముందు బాధకలిగిస్తుంది. బెంగ, ఆతుర్దా, శ్రద్ధ అనవసరంగా అధికమైతే తల్లిదండ్రులు తమ కర్తవ్యాల్ని సవ్యంగా నెరవేర్చలేనివారౌతారు.

కొందరు తల్లులికి బిడ్డలుచేసే మారాముకి పెట్టే ఏడుపులికే ప్రాణం విసిగిపోతుంది. శత్రువులు బిడ్డలై పుట్టారని చీదరించుకుంటారు తల్లిదండ్రుల్ని శిక్షించడంకోసం, అణిచివెయ్యడంకోసం భూమి కవతరించిన రాకాసు లంటారు. కేవలం ఏడిపించడం కోసమే బిడ్డలు పుట్టారనుకుంటారు. కాని ఇది నిజంకాదు. నిజంకాదని మరుక్షణంలో వారికే పొడగట్టుతుంది.

## బుద్ధిమంతులు *

నిజానికి పసిపాపలు చాలా బుద్ధిమంతులు. సబబు తెలిసినవారు. వాళ్లకి కావలసినది కేవలం స్నేహం, పాలు. తల్లి న్యాయంగా ఆదరిస్తుందా బిడ్డ అట్టే బాధపెట్టదు. వాడి అవసరాల్ని శాంతంతో శ్రద్ధగా కనిపెట్టండి. మీరు కోరినప్రకారం ప్రవర్తిస్తాడు. ప్రతి బిడ్డకి ముఖ్యంగా కావలసినవి తల్లి చిరునవ్వు, ఆదరణ. తన ఆటపాటల్లో తల్లి పంచుకోవాలి మృదువుగా ప్రేమగా తల్లి లాలించాలి. మోటుతనంవల్ల బిడ్డకి ప్రాణం విసుగుతుంది. బిడ్డ పెరుగుదలకి పాలెంత అవసరమో తల్లి ప్రేమాదరాలు అంత అవసరం. నిత్యమూ తల్లి మోటుగా కసిరి విసుక్కుంటూ ఉంటే బిడ్డలోకూడా క్రమంగా కోపమూ, కరుకుతనం, పెంకితనం మాట వినకపోవడం అలవడతాయి.

పాప ఏడుస్తుంటే ఉట్టిపెంకితనం అని అశ్రద్ధచెయ్యడం లేక అదిలించి ఊరుకోబెట్టడం ఒక్కొక్క తల్లికి మామూలు. కాని ఇది సరికాదు. పాప ఏడుస్తున్నా దంటే ఏదో కారణం ఉంటుంది ఆకలి కావచ్చు. పక్క మార్చవలసిన అవసరం ఉండవచ్చు. కడుపు నొప్పి కావచ్చు, లేదా పడుకోబెట్టినచోటు సుఖంగా లేకపోవచ్చు, అదీకాక భయపడి ఉండవచ్చు. పాప ఏడ్చాడంటేఅది తల్లికి పిలుపన్న మాట.

ఒక్కొక్కప్పుడు ఎంత సముదాయించినా పాప ఊరుకోకపోవచ్చు. ఆ రీతిగా ఏడుస్తుంటే తల్లికేమీ తోచక కంగారుపడుతుంది. ఎలాగైనా పాపబాధ నివారణ జేయాలని ఆత్రపడుతుంది, ఈ ఆత్రం తల్లికీ బిడ్డకీ కూడా సహజం. దానివల్లనే పరస్పరం అర్థంచేసుకోడానికి వీలు కలుగుతుంది. (అయితే ఆత్రానికి బెంగకి కూడా మితి ఉన్నాయి. మితిమీరితే సంరక్షణలో సమర్థత తగ్గుతుంది.) కాని శాంతంగా బిడ్డని అర్థం

చేసుకోడానికి ప్రయత్నిస్తే (వైద్యం చేయించవలసిన అవసరాల్లో మినహా) వాడి ఏడ్పు మానిపించడం కష్టం గాదు,

అసలు మొదటి కొద్దిరోజుల్లోనే పాపఅవసరాలు తల్లికి అర్థమౌతాయి. సామాన్యంగా ఆకలివేసినప్పుడు ఒకరకంగా ఏడుస్తాడు. పడక సరిగా కుదరనప్పుడు మరోకరకంగా ఏడుస్తాడు కడుపునొప్పితో బాధపడుతున్నప్పుడింకోరాగం తీస్తాడు. మొట్టమొదట ఈ తేడాలు కనిపించకపోవచ్చును. కాని క్రమంగా గుర్తించవచ్చును. ఆకలి అంటే ఒక్కపెట్టున రాదు. పొట్టలో అల్లరి క్రమక్రమంగా పెరుగుతుంది. అలాగే ఏడుపు కూడా ఆకలి ఎక్కువైన కొద్దీ చెవులు గింగుర్లెత్తేలాగు ఏడుస్తాడు గుక్కపడతాడు. పాలు సహించనప్పుడు ఆ లక్షణాలు ముఖంలో స్పష్టంగా కనిపిస్తాయి. పొరపాటు పడదామన్నా వీలుండదు పోతపాలపిల్లలు పాలు చాలకపోతే సీసా ఖాళీకాగానే ఒక క్షణం తాపీగా అటూ ఇటూ పరిశీలించి, అప్పుడే పాలైపోయినందుకు సీసామీద చిరుకోపంవచ్చినట్లు చూసి, ఆపైన నిస్పృహతో ఓపిగ్గా ఏడుస్తాడు. ఆకలివేసి ఏడుస్తున్నప్పుడు తల్లిరాకపోతే కోపంతో గట్టిగా ఏడుస్తాడు అప్పటికీ రాకపోతే జాలిగా ఏడుస్తాడు, పడక సరిగ్గా కుదరనప్పుడు ముందు గునిసి గునిసి ఏడుస్తాడు. చెవిపోటువల్లగాని బాధపడుతుంటే తల్లివైపు దీనంగా చూసి ఏడుస్తాడు. అలా కొంతసేపైన తరవాత తల్లి బాధను నివారించలేకపోయేసరికి వాడి ఏడుపుచూస్తే లోనున్న బాధతో పోరాడుతున్నాడనిపిస్తుంది. నిస్సహాయంగా బిడ్డని చేతుల్లో పెట్టుకునిచూసే తల్లికి గుబులు పుట్టుకొస్తుంది. అప్పుడప్పుడు బిడ్డ ఇంత హంగామా చేసి గంటతరవాత నిద్రపోతాడు. తిరిగి లేచి నవ్వులు వొలకపోస్తాడు. అప్పుడు విసుగు, కోపం, జాలి, నవ్వు, సంతోషం ఇందాకటినుంచీ విడిపించినందుకు తెచ్చిపెట్టుకొన్న కోపం, అందులోనే మాధుర్యం అప్పుడు జాలి, ప్రేమ ఒక్కసారిగా ముసురుకొస్తాయి. వాస్తవంగా మిగతా చాకిరీ రద్దీలో బిడ్డపట్ల శ్రద్ధ సన్నగిల్లినట్లయితే, తల్లికీ బిడ్డకీ బాధే బిడ్డ అవసరాల్ని సరిగా గ్రహించి సంరక్షించినప్పుడే ఏడిచేబిడ్డ ఏడుపు మాని పకపకా నవ్వుతాడు.

తల్లీ తండ్రీ కూడా పసిపాపతో స్నేహంచూపవలసిన అవసరం ఉంది. ఒకరికొకరు కావలసినవాళ్లనే పసితలపు అప్పుడే పాపబుర్రలో తళుకు తళుకుమంటుంది. ముఖ్యంగా పాలుతీసుకునేటప్పుడు పసిపాప తల్లిముఖంలోకి తదేకదీక్షగా చూడ్డానికి ప్రయత్నిస్తాడు. ఆ సమయంలోనే పాప కన్నుల్లో అన్యోన్యభావం ముద్రితమౌతుంది. ఆపైన నీళ్లుపోసేటప్పుడు లేక దగ్గర పడుకోబెట్టుకున్నప్పుడు ఆటపాటల్లో ఈ అపేక్ష, పెంపొందుతుంది. ఈ అన్యోన్యభావం పెంపొందే రెండుమూడుమాసాల వయసులో పసిబిడ్డల అవసరాల్ని సరిగా గ్రహించలేక వారిని అదిలించి ఏడ్పించినట్లయితే, పెరుగుదల కుంటుపడుతుంది. బిడ్డ సుఖమనేది మరిచిపోతాడు కోపాలు చూపే ఈడులో తల్లిని విదలించి కొట్టినా కలతచెందిన హృదయంతోనే ఆమెను అంటిపెట్టుకుంటూ, మనసునెప్పుడూ కోపంతోనూ,భయంతోనూ నింపుకుని, అలాటిమనస్తత్వంతోనే పెరుగుతాడు ప్రతి వస్తువునీ ప్రతిమనిషినీ చూసి బెదురుతాడు. లేదా కరవబోతాడు. ఏడ్చినప్పుడు పాలివ్వక పనితీరినప్పుడో, లేక లెక్కప్రకారం పోషిస్తున్నామని భ్రమపడో, పాలిచ్చి తాగనప్పుడు బలవంతాన దంతాల మధ్య వేలెట్టి చెంచాతో పాలుపోసి ఈరీతిగా చేసినట్లయితే బిడ్డ ఆరోగ్యం పాడౌతుంది. మనస్సు పాడౌతుంది బిడ్డ అవసరాలు గ్రహించి ఆప్రకారం పోషించి సంరక్షిస్తున్నప్పటికీ ఏడుపు మానకపోతే తప్పకుండా అనారోగ్యమే కారణమని నిర్ధారణచేసుకుని డాక్టర్ కి చూపించవలసిందే.

ఇవి అనాలోచనవల్ల అశ్రద్ధవల్ల కలిగే ఫలితాలు. కొందరికిశ్రద్ధ హద్దుమీరి ఉంటుంది. బిడ్డకి పాలిచ్చేవేళ పడుకోబెట్టేవేళ గంటలు కొలిచి ఒక్కనిమిషం ఇటూ అటూ కాకుండా వేళకి అన్నిటినీ అలవాటు చెయ్యాలంటారు.

ఇదిసరికాదు. ఎంతగా వేళప్రకారం అలవాటు మప్పాలన్నా అది కొంతవరకే సాధ్యపడుతుంది కాని చాదస్తానికి పోతే బిడ్డకి మంచిది కాదు తిరగబడతాడు. ఆరోగ్యం పాడుచేసుకుంటాడు ఏడుపు అధికమౌతుంది. మనిషికీ మనిషికీ ఎంతవ్యత్యాసం ఉంటుందో బిడ్డకీ బిడ్డకీ అలవాట్లలోకూడా అంత వ్యత్యాసం ఉంటుంది. అనారోగ్య, ఏదీ లేకుండా ఉంటే బిడ్డ తనంతటతానే కొన్ని వేళలకి అలవాటు పడతాడు. తన అలవాట్లు తానే అలవరుచుకుంటాడు. తన అవసరాల్ని తనకి తెలిసినధోరణిలో తెలుపుతాడు. కాబట్టి ఈవిషయంలో అంతగా భయపడవలసిన అగత్యం ఉండదు. మరీ ఆత్రపడితే బిడ్డని పెంచడంలో గల ఆనందాన్ని తల్లి పొందలేకపోతుంది. బిడ్డకూడా పొందలేకపోతాడు. అతిగారాబంవల్ల పెంకితనం అధికమౌతుందిగాని బిడ్డకి సుఖం లభించదు.

నిజానికిదంతా ప్రతితల్లికీ సహజంగా తెలుసును. కాని అతిఆత్రంవల్లగానిక బెంగవల్లగాని, నీరసంవల్లగాని, ఇతరచాకిరీలో తీరికలేకపోవటంవల్లగాని, లేదా ఆర్థికదైన్యంద్వారా ఏర్పడిన పరిస్థితులవల్లగాని తాత్కాలికంగా కనుమరుగైపోవడం సంభవం తరవాత గ్రహించినప్పటికీ ఉపయోగం ఉండదు అప్పటికే బిడ్డమనస్థితి పాడై ఉంటుంది తిరిగి సహజస్థితికి మార్చడం కృత్యాద్యవస్థ అవుతుంది

పసిబిడ్డలు తల్లుల్ని నవ్విస్తారు ఏడిపిస్తారు. బిడ్డతోజీవనాన్ని అనేకమందిస్వర్గానందంతో సమానంగా అనుభవిస్తున్నారు కాని బిడ్డతో బ్రతుకుని నరకప్రాయం చేసుకున్న తల్లులూ ఉన్నారు. స్వర్గాన్ని సృష్టించుకున్నా, నరకాన్ని సృష్టించుకున్నా తల్లి చేతుల్లో ఉంది తల్లి తనకి సహజంగా తెలియగల విషయాల్ని, శాంతంగా ఆలోచించి గ్రహించగలిగినట్లయితే బిడ్డ నవ్వించినా ఏడిపించినా నవ్వు తెచ్చుకోవచ్చును. అందువల్ల సహజంగా తెలిసే విషయాల్నే జ్ఞప్తికి తేవలసిన అవసరం అప్పుడప్పుడు కలుగుతుంది.

"ఎస్సార్"

---

# రమణమహర్షి

(8 వ-పేజీ తరువాయి)

నసే వర్ణింప నలవికాని ఆనందపారవశ్యము వెంకటరామన్‌కు కలిగెను

1896 సం॥ లో అనగా మదుసటి సంవత్సరమందు వెంకటరామన్ ఒకనాడు ఒంటరిగా కూర్చుండిన సమయమందు ఆయనకు మరణము సమీపించుచున్నదని విపరీతమైన భయ మొకటి అవేశించినదట. ఈ అనుభవ విశేషమును రమణమహర్షియే తరువాత కొంత కాలమునకు వెల్లడిచేసెను ఆ నాటికి ఆయన శరీరం దృఢంగా ఆరోగ్యంగానే ఉంది ఎన్నడూ జబ్బుపడి యుండలేదు. కాని తాను మరణించుచున్నట్లుగా ఒక మనోనిశ్చయ మయ్యెను. ఈ అనుమానకారణ మేమిటో వైద్యుల నడిగి తెలుసుకొనవలెననే అభిప్రాయం కలుగలేదు అప్పటి భావవేగం అతితీవ్రముగా నుండెను మరణభయమున్నూ, మరణావస్థానభవమున్నూ ఒక్క పర్యాయంగా కలిగినవి. అవయవములు కొయ్యబారినవట. శ్వాస నిలిచిపోయినదట పెదవులు బిగిసిపోయినవి. శవాకృతి శరీరానికి ఏర్పడింది. కాని మనస్సు పని చేయుచునే యున్నది. అప్పుడు వెంకటరామన్ ఇల్లా అనుకొన్నాడు. "నేనిప్పుడు మరణించితిని శరీరము కాష్ఠప్రాయమైనది దీని నింక శ్మశానమునకు చేర్చెదరు తగలబెట్టిన తరువాత నది బూడిదయగును. కాని "నేను" అను భావస్ఫురణ పోలేదే! కావున నేను అనునది యీ శరీరము కాదు మరణము యీశరీరమునే నాశన మొనర్చును, గాని తద్భిన్నమైన "అహం" పదార్థమును తాకజాలదు ఈ అహము నాశనము లేనిది నేను ఆత్మను, నేను దేహముకాదు అని నిర్ణయించుకొంటిని ఈ భావపరంపర వేర్వేరుగా నాకు స్ఫురించలేదు ఈ భావాలన్నియు ఒక్కటే మెరుపు మెరిసినట్లుగా నాకు కలిగినవి" అని ఆనాటి అనుభవమును గూర్చి రమణమహర్షి కొంతకాలముతరువాత వివరించి చెప్పెను అప్పటికి వెంకటరామన్ వయస్సు 17 సంవత్సరములు మాత్రమే వారి ఆత్మసాక్షాత్కారమునకు అది అంకురార్పణ. అంతటితో ఆయనకు ఆటలమీద ఆసక్తి పోయింది చదువుమీద శ్రద్ధ సన్నగిల్లినది అన్నపానములమీద అభిరుచికూడా అంతరించెను ఏకాంతవాసము, దీర్ఘాలోచన ఎక్కువయ్యెను అనుదినము ఆలయమునకు పోవుట అలవాటైనది. మీనాక్షీసుందరేశ్వరుల సన్నిధియందు కన్నీరు కార్చుచు ప్రార్థనచేయుచుండెను. భగవద్ధ్యానము నందున్న సమయంలో తప్ప తదితర వేళలందు ఆయన పడుచుండెడి పరితాపము ఇంతా అంతా కాదు. "మోక్షమంటే ఏమిటో నాకు తెలియదు. వేదాంతవిషయ జ్ఞానం నాకు ఏమిన్నీ లేదు. కాని మీనాక్షీ సుందరేశ్వరుల మూర్తులను చూచుచుండినప్పుడు నా హృదయము పొంగిపోయేది" అని రమణమహర్షి ఆనాటి తన అనుభవ విశేషమును ఒకమారు చెప్పియుండెను.

చదువుమాని యిట్లు యోగాసనాసీనుడై యుండిన తమ్ముని జూచినప్పుడు ఇంటి పెద్దయై యుండిన అన్నగారు చాలా పరితపించుచుండిరి. తమ్ముని నిందించుచుండిరి.

1896 సం॥ ఆగస్టు 29 తేదీని ఇంగ్లీషు వ్యాకరణమును బాగుగా చదువనందున, కంఠస్థము చేయక విడిచిపెట్టిన భాగమును ముమ్మారు వ్రాసి తీసుకొని రమ్మని ఉపాధ్యాయుడు ఆజ్ఞాపించెను. ఇంటికి వచ్చి రెండు తూర్లు అశ్రద్ధగా ఆసక్తిలేకుండా వ్రాసెను ఆసక్తిలేని పని చేయుట ఎందుకని అతనికే తోచి వ్రాత నిలిపివేసి పద్మాసనం వేసికొని కూర్చుండెను. అన్నగారు ఇదంతా ఒక మూలనుండి చూచుచుండిరి "చదువు రానివానికి యివన్నీ ఎందుకు?" అని అన్న కోపించెను వెంకటరామన్ ఆలోచనలో పడ్డారు "మన లక్ష్యం ఒకచోట ఉండగా నా కిక్కడ ఉండవలసినపని ఏమిటి? అని ప్రశ్నించుకొనెను ఒక సంవత్సరంక్రిందట తనకు పరమానందం కలుగజేసిన అరుణాచలం జ్ఞప్తికి వచ్చింది ఇల్లు విడిచి అరుణాచలం పోవుటకు నిశ్చయించెను

అన్నగారు తన కాలేజీ జీతం రూ 5 లు కట్టవలసినదని వెంకటరామన్‌తో చెప్పెను. కాని రూ 3 లు మాత్రమే వెంకటరామన్ పెట్టెలోనుంచి తీసికున్నాడు.

"నా తండ్రిని వెదకుచు నేను అతని ఆజ్ఞానుసారము ఇక్కడినుండి బయలుదేరుచున్నాను ఇందుకై ఎవ్వరూ చింతింపవద్దు. నన్ను వెదకుటకై ద్రవ్యం ఖర్చు చేయవద్దు" అని ఒక చీటి వ్రాసి యింట్లో పెట్టి, వెంకటరామన్ రమణమహర్షిగా మారుటకై రైలుఎక్కి ప్రయాణమయ్యెను. తన తండ్రియగు భగవంతునిపై మనస్సు లగ్నంచేసి మహాసంకల్పంతో బయలుదేరెను.

రైలుబండియందు ఒక మౌల్వీ సాధువుల చరిత్రములగూర్చి యుపన్యసించుచుండెను. వెంకటరామన్ కళ్ళుమూసికొని ధ్యాననిమగ్నుడై యుండుటజూచి, అతనితో ఆ మౌల్వీ సాహెబు 'తిరువణ్ణామలైకు పోవలసిన నీవు దిండివనంవరకే టిక్కెట్టు కొన్నావు. కనక విల్లుపురంలో దిగి మరొక రైలుఎక్కి నీవు పోవలెను" అని చెప్పెను. వెంకటరామన్‌కు చేతనున్నది రెండున్నర అణాలు మాత్రమే. విల్లుపురముస్టేషనులో దిగి మాంబళముపట్టువరకు తిరిగి టిక్కెట్టుకొని అచటినుండి పదిమైళ్ళ కాలినడకను పోడఅరయని నల్లూరు చేరి అచటినుండి కోటూరు గ్రామము చేరికొని తన చెవుల కమ్మలను ఒక యింటియజమానికి అమ్మి నాలుగు రూపాయలు తీసుకొని రైలెక్కి చిట్టచివరకు తిరువణ్ణామలై చేరెను. సరాసరి అరుణాచలఅలయములోని గర్భగుడిలోనికి పరువెత్తుకొని వెళ్లి, 'తండ్రీ నా సర్వస్వమును వదలి తండ్రియగు నిన్ను శరణు జొచ్చితి'నని మొర పెట్టుకొనెను అయిదువారాలనుంచి ఆయన పడుచుండిన ఆవేదనవల్ల కలిగిన ఒడలిమంటలు ఆయన కప్పుడు శాంతించెను. అరుణాచలం అనేది కొండపేరు. శివుడిక్కడ తేజోరూపమున వెలసెనని పురాణాలు అన్నారు 'స్మరణాదరుణాచలమ్' స్మరిస్తేనే చాలు అరణాచలం ముక్తి నిస్తుందని ఆర్యవాక్యము.

వెంకటరామన్ తన చేతిలోని చిల్లర దూరంగా పారవేసెను. తన వస్త్రమును చించి ఒక పేలికను గోచీగా ధరించెను. మిగిలిన వస్త్రమును పారవైచెను. తన ఉత్తమకుల మయిన బ్రాహ్మణకుల మని సూచించెడి జందెమును తెంపివేసెను "నేను ఎవరికన్న ఉత్తముడను? ఎవరికన్న అధముడను? అని ప్రశ్నించుకొనెను. ఒక మంగలిసహాయంతో తన జుట్టు కూడా తీయించివేసెను తానొక ప్రత్యేకప్రాణిననే భావం కూడ విసర్జించెను. మౌనముద్ర వహించి ఆలయం మొదటిప్రాకారంలో ఉన్న వేగాళ్లమంటపముయొక్క నైరృతి భాగములో ఒక నేలసారంగం ఉంది ఇక్కడ యీశ్వరలింగం ఒకటి ప్రతిష్ఠింపబడియుండెను కాని అక్కడ పూజలు జరుగవు. అక్కడనే ఆ సారంగంలోనే ఆయన తన తపస్సు ప్రారంభించెను పద్మాసనం వేసికొని కూర్చుండి తన శరీరమునే తాను మరచియుండెను. క్రిమికీటకములు ఆయన తొడలను కరచి పుండ్లుచేసిన నెత్తురు చీము

వచ్చుచుండెను. అతిరిలోని పిల్లలు వినోదార్థంగా ఆ సొరంగంలో ఉన్న ఆ తపశ్శాలిపై కొందరాళ్లు రువ్వుతూ ఉండేవారు. ఒక నాడు వెంకటాచలమొదలి ఇదంతా చూచెను. ఈ సంగతిని పళనిస్వామికి తెలియజేసెను. చీము నెత్తురు ప్రవహించుచున్న ఆ మునిపుంగవుని చేతులతో ఎత్తి గోపురసుబ్రహ్మణ్యదేవాలయములో ఉంచిరి. ఉద్దండినయనారుకూడా అనాటి ఆయన స్థితిని కండ్లారచూచి ఆయనవద్దనే కూర్చుండెను. ఈ నయనారే ఆయనకు ప్రథమపరిచారకుడు కాన ఘోరతపస్సులో నున్న మహర్షి ఒక్కనాడైనను కన్ను తెరచి చూడలేదు. తంబిరాన్ అను భక్తుడు అక్కడ తపస్సు చేయుచుండెను. అతడు రమణమహర్షిని చూచి తిరువణ్ణామలైలోని గురుమూర్తమనే ప్రదేశమునకు తీసికొని పోయెను. అక్కడ మహర్షిని చీమలు కఱచి తినుచుండెడివి. శరీరము శుష్కించి అస్థిపంజరముమాత్రము మిగిలినది. నడచునట్టి అభ్యాసం పోయినది.

గురుమూర్తమువద్ద తపస్సు చేయుచుండిన యీయన ఎవరో లోకానికి తెలియలేదు. "గురుమూర్తస్వామి" అని పిలుస్తూ ఉండేవారు. ఆయన పూర్వాశ్రమవిశేషమును తెలిసికొనవలెనని తాలూకాశిరస్తాదారు వెంకటరామయ్యరు అక్కడనే కదలకుండా కూర్చుండెను. ఉద్యోగం పోయినాసరే అని అక్కడనే కూర్చుండెను. మహర్షికి అప్పుడు మనస్సు కరగి "వెంకటరామన్-తిరుచ్చుళి" అని తమ పేరు వివరం వ్రాసిరి. ఒకటిన్నరసంవత్సరం గురుమూర్తంవద్ద మహర్షి తపస్సుచేసెను. అటుపిమ్మట మామిడితోటలో ఆరునెలలుండిరి. పళనిస్వామికూడా మహర్షివద్దనే ఉండి తపస్సు చేయుచుండెను.

ఆయనతల్లి అప్పుడు తన రెండవకుమారుడగు నెల్లియప్పయ్యరు ఇంట్లో మనమదుర అనే పట్టణంలో ఉండెను. పినతండ్రి నెల్లియప్పయ్యరు వచ్చి మహర్షిని చూచెను. పినతండ్రిని మహర్షి లక్ష్యం చెయ్యలేదు. కాని కన్నతల్లి తన పెద్ద కుమారుడైన నాగస్వామితో కలిసి కొండెక్కి మహర్షి వద్దకు వచ్చెను. ఇకనైననూ ఇంటికి రమ్మని తల్లి వేడుకొన్నది. ఏడ్చినది. కాని "ప్రారబ్ధకర్మానుసారం జరిగితీరవలెను." అని మహర్షి ఆమెకు ప్రత్యుత్తరం వ్రాసియిచ్చెను. అప్పుడు ఆయన పవళకున్ర (ప్రవాళపర్వతము) అను కొండమీద నివాసంగా ఉండెను. అచటిగుహలలో ఆయన ఉండేవారు. క్రూరమృగాలు ఆయన జోలికి పోయేవి కావు.

మోక్షకాములైనవారనేకులు మహర్షి వద్దకు వచ్చి అనేకవిషయములను అడిగి సమాధానమును పొంది సంతృప్తి పొందుతూ ఉండేవారు. శంకరుని అద్వైతము వీరి తత్వము అని చెప్పవచ్చును కాని తర్కశాస్త్రపాండిత్యపద్ధతిగా వేదాంతవిషయములనుచర్చించేవారు కారు. పాండిత్యమును నిరసించిరి కూడాను.



పాతాళ లింగేశ్వరుడు; ఎదురుగా నంది విగ్రహం. రమణమహర్షి చిన్నతనంలో ఉగ్రతపస్సుచేసిన స్థలం

అనేకులు సంసారదుఃఖము పాలై వారి వద్దకు వచ్చి ఆత్మశాంతినిపొందిరి. ఆంధ్రులు పండితోత్తములు నగు కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు రమణమహామహర్షి సన్నిధిని సకలగ్రంథసంశయవిచ్ఛేదమును పొందినవారై తపశ్చర్యకు సంక్రమించి ఉన్నత పదవిని పొందిరి. మద్రాసువద్ద తిరువత్తూరు నందలి దేవాలయంవద్ద దీక్షబూని గణపతిశాస్త్రిగారు తపస్సు చేయుచుండగా శ్రీరమణమహర్షి వారి కచ్చట కన్పించిరి. అనాడే తిరువణ్ణామలైయందు మహర్షికి తానాకాశములో ఎచ్చటికో పోవుచుండినట్లయ్యెను. గణపతిమునియే మహర్షికి రమణనామము నిచ్చియుండిరి. శ్రీ రమణమహర్షి తన మౌనము వీడి 1907 సంవత్సరమున మొట్టమొదట మాటలాడినది గణపతిశాస్త్రిగారికొరకే.—

మహర్షి గారి భక్తులనేకులు పాశ్చాత్యులలో కలరు. లట్వ్యా దేశస్థుడు హాక్ డిక్మన్–ఆంగ్ల ప్రముఖుడు పాల్ బ్రంటన్–పోలెండు దేశస్థుడు మారిస్ ఫ్రీడ్మన్.

రమణమహర్షి తల్లి అలగమ్మ 1916 సం॥లో తిరిగి తిరువణ్ణామలై చేరెను–మహర్షి ఆమెకు పరిచర్యలు చేసెను. రామనామజపము వేదాధ్యయనం చేయుచుండగా తల్లి హృదయంమీద తన దక్షిణహస్తమును, ఎడమ చేతిని ఆమెశిరస్సుపైనను రమణమహర్షి ఉంచగా 19-5-22 తేది రాత్రి ఆమె మహర్షి చేతులలో ముక్తిపొందెను. ఆమె శరీరం కొండక్రింద సమాధి చేయబడెను.

శ్రీ రమణమహర్షి అరవములో అతి మధురమైన కవిత్వపటుత్వము కలవారు. శంకరాచార్యులవారి వివేకచూడామణిని సులభగ్రాహ్యంగా అరవంలో తర్జుమా చేసిరి. శంకరులవారి 'గురుస్తుతి' 'హస్తామలకము' మొదలైనవి మలయాళములో రచించిరి. భిక్షాటన మొనర్చునప్పుడు పాడుచు పోవుటకై "అక్షరమణిమాల" రచించిరి. "అరుణాచలశివ, అరుణాచలశివ, అరుణాచలశివ" అనునది యీకీర్తనకు మకుటము – ఇటువంటివే మరికొన్ని రచనలు కలవు. "దేవికాలోత్తరము" "అరుణాచలాష్టకము" "పదికము" "నవమణిమాలై" "అరుణాచలపంచకము" ఇవి శ్రీ రమణమహర్షి రచనలు.

వీరి సోదరుడు అనగా కడపటి తమ్ముడు నాగసుందరం సన్యసించి నిరంజనానంద నామముతో ఆశ్రమమును జరుపుచున్నారు.

రమణమహర్షి యుపదేశములను వివరించుచు కావ్యకంఠ గణపతి మునీంద్రులు "రమణగీత" యను గ్రంథమును రచించిరి.

P. 36

చిత్రసమీక్ష :

# పల్లెటూరి పిల్ల

నిర్మాతలు: బి.ఏ. సుబ్బారావు, శోభనాచల ప్రొడక్షన్స్. దర్శకులు కథకులు: శ్రీ బి. ఏ. సుబ్బారావు. మాటలు పాటలు: శ్రీ తాపీ ధర్మారావు. డిస్ట్రిబ్యూటర్లు: పూర్ణా పిక్చర్సు. విడుదల: ఏప్రిల్ 20.

నటీనటులు : అంజలీదేవి, హేమలత, కనకం, బేబీమల్లిక, నాగేశ్వరరావు, యన్. టి. రామారావు, ఏ. వి. సుబ్బారావు, మొదలైనవారు.

పల్లెసీమలో శాంతిజీవనాన్ని భంగపరిచే వారిని పల్లెప్రజ ఏరీతిగా ఎదిరించి తమ ఇళ్లనూ సంసారాలనూ ఎలా కాపాడుకోడానికి వీలవుతుందో చూపడానికి ఈ చిత్రంలో ప్రయత్నం చేయబడింది. పల్లెవాసుల దయాదాక్షిణ్యాలు ధర్మబుద్ధీ ఎంతటి క్రూరులలోనైనా హృదయపరివర్తన తేగలవని కథకులు ఈ చిత్రంద్వారా చెప్తున్నారు:

క్రూరుడూ, కర్కోటకుడూ అయిన రాజూ, కంపనదొరచేతులలో పెరిగి పెద్దవాడైన జయంత్, రాజాజ్ఞానుసారం గ్రామాలు కొల్లగొడుతూ, ప్రజలను పీడిస్తూ, ఒక "పల్లెటూరి"లో ఒక 'పిల్ల' పెట్టిన చెంపపెట్టూ, సూటిపోటు మాటలతో చేసిన బోధలమూలంగా మనసు, మారి, కంపనకొలువు వదిలి ఆ పల్లె చేరతాడు. తనమీదా గ్రామంమీదా పగతో కంపన దండెత్తివస్తాడనే భయంతో అక్కడియువకులకు సాముగరిడీల శిక్షణ ఇస్తాడు. తనని లెంపకాయకొట్టిన శాంతకు ఆ బాల్యమిత్రుడూ, మేనమామకొడుకూ అయిన వసంత్ ఇందులో ఇతనికి చేదోడువాదోడుగా ఉంటాడు. జయంత్ మంచితనం, శౌర్యం చూసిన శాంత అతన్ని ప్రేమిస్తుంది. అతనూ ఆమెను ప్రేమిస్తాడు. శాంతను పెళ్లిచేసుకొందామనుకొన్న వసంత్ మొదట ఇందుకు కోపపడినా, ఇద్దరి అభిమతాలూ తెలుసుకొని తన ప్రేమను త్యాగం చేస్తాడు.

తర్వాత కొన్నాళ్లకు కంపన గ్రామం మీదికి దండెత్తిరాగా జయంత్ వసంత్‌ల నాయకత్వాన గ్రామయువకులు వారిని ఓడించి తరిమివేస్తారు. దరిమిలాను, కంపన మోసంతో జయంత్‌ని బందీ చేయిస్తాడు. అందుకు తానే కారకుడని అనుమానంతో శాంత నిందించడంవల్ల వసంత్ కంపన దుర్గానికి పోయి, కంపన ఉంపుడుకత్తె సహాయంతో జయంత్‌ని తప్పిస్తాడు. తర్వాత వసంత్, జయంత్ ఇద్దరూకూడా చేతికందిన శత్రువునికూడా శిక్షించని పల్లెటూరి ఔదార్యం చూపుతారు. కంపనభటుల చేతులలోపడిన జయంత్‌కొడుకును కాపాడడంలో తగిలిన గాయంవల్ల వసంత్ మరణిస్తాడు. కంపన్నకు హృదయపరివర్తనం కలుగుతుంది. గ్రామస్థులందరూ, వసంత్‌ని ఆదర్శంగా పెట్టుకొని 'హింస', 'రక్తపాతం' జోలికి పోమని ప్రతినపూనడం జరుగుతుంది. కథలో వ్యక్తులపేర్లు, వేషభూషలు అపరిచితంగానూ కొన్ని సన్నివేశాలు అసహజంగానూ వున్నా, వర్తమానకాలంలో రైతులు ధాన్యసేకరణాదిసందర్భాలలో ఉద్యోగులమూలంగానూ, కమ్యూనిస్టుల దౌర్జన్యాలవల్లనూ పడుతున్న బాధలకు సారూప్యంగా వుండే ఘట్టాలు, మానవునిలోని త్యాగశీలం, ధైర్యం, శౌర్యం, దేశభక్తి వెల్లడి అయే ఘట్టాలూ ఉన్నాయి. హీనమయిన అభిరుచిని వ్యక్తపరిచే హాస్యఘట్టాలు ఉన్నా ఫిలిం మొత్తంమీద ప్రేక్షకజనాన్ని రంజింపచేస్తుంది.



అమెరికా టెలివిజన్ ప్రసారం. సుప్రసిద్ధ నటీమణి గెర్ట్రూడ్ లారెన్స్ నాయకిగా "ది గ్రేట్ కాథరైన్" అనే నాటికను ప్రసారం చేస్తున్నారు.




# "రేడియో - ఐసోటోప్సు"

సృష్టిలో మనకు ఒకక్రమం ఒక సూత్రానికి బద్ధమైన విశేషాలు కనబడినంత మేరకు మాత్రమే, మన భౌతికశాస్త్రాలూ, రసాయనికశాస్త్రాలూ అన్నీ వర్తిస్తాయి. ఈ శాస్త్రాలకృషిచరిత్రంతా ఆ క్రమమూ, ఆ న్యాయాలూ, ఆయావిషయాలలో ప్రకృతిబద్ధమైన నిబంధనలు, వీట్లను గ్రహించుకొంటూ పోతూ, విభిన్నాంశాలు కనబడినప్పుడు వాట్లను కూడా సమన్వయపరచుకొని రాగల సూత్రాలనూ నిబంధనలనూ పరిశోధించుకొంటూ, అభివృద్ధి చెందటంగానే కనిపిస్తుంది.

భౌతికరసాయనశాస్త్ర విశేషాలను, నేటి నవీనపరిశోధనలను మామూలుప్రజ లందరికీ తెలిసేటంత తేలికగా చెప్పాలంటే, ఆ శాస్త్రాలకు సంబంధించి ప్రతివాళ్లకూ పరిచయంగా ఉంటున్న భాషాసంపత్తి మనకు చాలా తక్కువ. అందుచేత ఒక్కొక్కప్పుడు చెప్పిన విషయాన్ని అర్థంచేసికొంటూన్నా మనుకొంటూనే మరో విధంగా అపార్థంచేసుకొంటూ పూర్తిగా భ్రమలో పడిపోయే అస్కారంకూడా చాలా ఎక్కువ ఉంటుంది. అయినా సాధ్యనంతలో "రేడియో—" "ఐసోటోప్"— అన్న పదాలవాడుకదాకాకల శాస్త్రం స్థూలంగాచూచుకొందాం.

సృష్టిలోని పదార్థాలన్నీ నూరుకన్న తక్కువైన మూలపదార్థాల సంకలనంవల్ల కలిగినవన్న జ్ఞానం, చిన్న స్కూలు చదువుల్లో కూడా ఈనాడు తెలిసివస్తూన్న విషయం. వీట్లల్లో సీసం, రాగి, ఇనుము, బంగారు, వెండి, మొదలైన శుద్ధలోహాలు, గంధకం, బొగ్గు, భాస్వరము, మొదలైన లోహేతరశుద్ధపదార్థాలు, ప్రాణవాయువు, ఉదజనివాయువు, నైట్రోజెన్, మొదలైన శుద్ధవాయువులు. ఇవన్నీ ఈ పైచెప్పిన సృష్టిమూలపదార్థాలలో లెక్కకు వచ్చేవే అన్నది సామాన్య రసాయనికజ్ఞానం. అల్లాగే, ఈ ప్రతిమూల పదార్థంయొక్క మూలస్వరూపం అణువనీ (*Atom*) ఒక మూలపదార్థంయొక్క అణువుకూ మరొక మూలపదార్థం అణువుకూ మూలమైన తేడా, ఈ అణువు కున్న బరువనీ, ఈ అణుప్రమాణం, ఏకోత్తరవృద్ధిలో ఉదజనిఅణువునుంచీ, నేడు ఆటంబాంబులో వాడుతున్న యురేనియంఅణువువరకూ, పెరుగుకుంటూవస్తూందని, సామాన్యభౌతిక జ్ఞానంవల్లనే తెలిసివస్తుంది. ఈ పెరగటానికి కారణం, వివిధమూలపదార్థాలలో అణునిర్మాణహేతువులైన, ప్రోటాను, ఎలక్ట్రాన్, న్యూట్రాన్‌లనే విద్యున్మూలకణాల సంఖ్యావృద్ధి అని భౌతికశాస్త్రంవల్ల తెలిసివస్తుంది. ఈ అణునిర్మాణం భావించుకొనేందుకు, అన్నిటికన్న తేలికైన ఉదజనిఅణునిర్మాణస్వరూపం స్థూలంగా ఇల్లా నిర్ణయించుకొన్నారు. కేంద్రంలో సూర్యునిమాదిరిగా ఒక ప్రోటాను ఉంటుంది. (అణువుకు బరువు చేకూర్చిపెట్టేది ఈ ప్రోటాను) దీని చుట్టూ సూర్యునిచుట్టూ తిరుగుతూన్న గ్రహంలాగా పరిభ్రమిస్తూ ఒక ఎలక్ట్రానుంటుంది

ఈ రెండిటితో మాత్రమే ఉన్న గ్రహకూటం, ఉదజని అణువు. సంఖ్యాస్వరూపంగా ఒక ప్రోటాను, ఒక ఎలక్ట్రాన్ మాత్రమే ఈ అణువులో దాఖలు వస్తాయి. అక్కడినుంచీ వరుసగా బరువు పెరుగుతూ వస్తున్న మూలపదార్థాల అణుస్వరూపం చిత్రించుకొంటూ వస్తే, కేంద్రంలో ప్రోటానుల సంఖ్య, చుట్టూ తిరుగుతున్న ఎలక్ట్రానుల సంఖ్యా పెరుగుతూ, గ్రహకూటం అంతకంతకూ క్లిష్టమవుతూ వస్తుంది. సూర్యునిచుట్టూ ఉన్న గ్రహాలు, వివిధకక్ష్యాంతరాలలో పరిభ్రమిస్తున్నట్లే, ఇల్లా క్లిష్టమైన మూలపదార్థాల కేంద్రాలలో ప్రోటానుల బరువు సంఖ్య పెరుగుతూ వచ్చి, పరిభ్రమిస్తున్న ఎలక్ట్రానుల సంఖ్య, అవి తిరుగుతూన్న కక్ష్యాంతరాలూ కూడా పెరుగుకుంటూ వస్తాయి. ఇల్లా యురేనియం అన్న మూలపదార్థం దగ్గరకు వచ్చేటప్పటికి, 93 ప్రోటానులముద్దగా ఉన్న కేంద్రమూ, చుట్టూ పరిభ్రమిస్తున్న ఎలక్ట్రానులు తొంభైమూడు, ఇంతటి గ్రహకూటమూ యురేనియం అణువుస్వరూపంగా తయారవుతుంది.

పైనచెప్పిన సంఖ్యాక్రమంలో వస్తూన్న మూలపదార్థాల అణువులలో, దాదాపు 90 అంకెవచ్చే "రేడియం" అనే మూలపదార్థపు అణువుక్రిందిదాకా కల, మూలపదార్థాలు, (ఎలిమెంట్సు) సామాన్యస్థితిలో ఏ భౌతికపుమార్పులూ చెందటం, భౌతికశాస్త్ర ప్రయోగాలలో కూడా ఎక్కువ కనబడేది కాదు. కాని "రేడియం" అన్న పదార్థం దగ్గిరకు వచ్చేటప్పటికి, ఈ అణువులోని గ్రహకూటంలో నిత్యం కొన్ని ఎలక్ట్రానులూ ప్రోటానలూ కూడా అణువునుంచి బైటికిపోతూన్నట్టు, గ్రహకూటంలో నిత్యమూ సంక్లిష్టమైన మార్పులు జరుగుతూన్నట్టు గ్రహించారు ఇల్లా బైటికి వచ్చే ఎలక్ట్రానులకు 'బీటా' కిరణాలని, ప్రోటాన్లకు ఆల్ఫాకిరణాలని పేరు పెట్టారు. ఇల్లా, ఆల్ఫాబీటా కిరణాలను వదితపదార్థాలను "రేడియో-ఆక్టివ్" పదార్థాలంటారు. అణువు (*Atom*) యొక్క సహజస్వభావం కనిపెట్టాలంటే ఈ రేడియో ఆక్టివ్ పదార్థాలను పరిశోధించినకొద్దీ ఎక్కువ తేలికైంది.

ప్రోటాను ఎలక్ట్రానుల సంఖ్య మూలపదార్థాలను నిర్ణయించసాగేటప్పటికి, మూలపదార్థాల అణువుల బరువులుకూడా, అంకెల లెఖ్ఖనుబట్టి ఎక్కంప్రకారమే బరువు కూడా కచ్చితంగా పెరగాలని శాస్త్రం

సూచించింది. కాని అల్లా పెరుగుతూ రాలేదు దీనికి మళ్లీ సమన్వయాలు కుదుర్చుకొంటూ వచ్చారు కేంద్రంలో ఉన్న ప్రోటానలతో బరువు చాలలేదు కాబట్టి ప్రోటాను ఎలక్ట్రాను కలిసిపోయి ఉన్న "న్యూట్రాన్" లనేవి కూడా బరువును పెంచేందుకు ప్రతి మూలపదార్థపు అణువు కేంద్రంలోనే కొన్ని గడ్డకట్టుకొని ఉన్నాయని ఊహించారు. ఇంకా నిశితంగా పోయి పరిశోధనలు సాగించుకొంటూ రాగా, ఒక్కొక్క పదార్థానికి సంపూర్ణాంకాలలో రావలసిన ఆటంబరువు, డెసిమల్సుతో కూడా కూడివస్తుండబట్టి, ఈమూలపదార్థాలలో కూడా, రాసాయనిక, భౌతికలక్షణాలన్ని దాదాపు ఒకటేఅయి, స్వల్పభౌతిక నిర్మాణవిభేదమున్న రెండుమూడుపదార్థాలుగా ఈ ఒకే మూలపదార్థం ఉంటూన్నదని గ్రహించారు స్వల్పంగా అణువు బరువు భేదంతో ఉన్న ఏకరసాయనికమూలపదార్థాలను, ఐసోటోప్స్ అని పేరుపెట్టారు అంటే ఉదాహరణకు బొగ్గుకు బొగ్గు ఐసోటోప్‌కు, అణువు బరువులో స్వల్పంగా భేదముంటుంది.

రేడియో ఆక్టివ్ పదార్థాలంటేనూ ఐసోటోప్స్ అంటేనూ సూచాయగా గ్రహించాము సామాన్యపదార్థాలకు రేడియో ఆక్టివ్ స్వభావము ఉండదని గ్రహించాము

నేటి ఆటంబాంబుతయారీలో యురేనియం అణువులను బద్దలుగొట్టి అణుకేంద్రంలో ఉన్న న్యూట్రానులను అపారంగా విముక్తం చేస్తూంటారు. ఈ బద్దలు కొట్టినప్పుడు చిటికిన వ్రేలిగోరు ప్రమాణంగల ప్రదేశంలో ఒక సెకనుకు శతలక్షకోటి న్యూట్రానులకు మించి మహావేగంతో ప్రవహిస్తాయి. ఈ ప్రవాహంలో, రేడియో ఆక్టివిటీ ఎంతమాత్రమూ లేని, ఇనుము, బొగ్గు, కోబాల్టు, మొదలైన సామాన్య మూలపదార్థాలను కొంతకాలం ఉంచితే, ఈ పదార్థాల రేడియో ఐసోటోపులనే, రేడియో ఆక్టివ్ ఇనుము, బొగ్గు మొదలైన పదార్థాలు తయారవుతాయి. ఆటంబాంబు నిర్మాణపు ఫ్యాక్టరీలాంటి ఫ్యాక్టరీలోనే, బాంబునిర్మాణానికి ఉపయోగించే ప్రయోగవిధానాలనే అవలంబించి ఈ రేడియో ఆక్టివ్ ఐసోటోపులను తయారు చేస్తారు ఇల్లా తయారుచేసిన రేడియో కార్బనును (బొగ్గు)ఒకచిటికెడు తీసికొని 5,000 టన్నుల మామూలు బొగ్గులో కలిపివేసి ఆ గుట్టలోనుంచి ఒక చెమ్చాడు బొగ్గును పరీక్షిస్తే, అందులోకూడా ఈ రేడియో కార్బనుస్వభావము బైలుపడుతుంది. అంటే రేడియో ఆక్టివిటీ తెలిపే యంత్రంలో, ఈ కాస్త బొగ్గులోకూడా, రేడియో ఆక్టివ్ నిదర్శనాలు కనబడుతాయి.

మామూలుపదార్థాలు వివిధఅవస్థలలో ఎల్లా ప్రవర్తిస్తున్నదీ సామాన్యప్రయోగాలవల్ల తెలియనప్పుడు, ఆ పదార్థం ప్రయోజనాలను దాని గుణగణాలను పరిశీలించేందుకు, ఆపదార్థపు రేడియో ఐసోటోపులు బాగా ఉపకరిస్తాయి

ఆటంబాంబునిర్మాణ కేంద్రంలోనే ఈ రేడియో ఐసోటోప్సునిర్మాణం సాగించే ఫ్యాక్టరీకూడా స్థాపించారు 1946 నించి ఈఫ్యాక్టరీ 8000 మార్లు రేడియో ఐసోటోపు సరకులను వివిధదేశాలపరిశోధకశాలలకు ఆస్పత్రులకు, విమానాలద్వారా, ఓడలద్వారా రైళ్ళద్వారా పంపించింది

రేడియోఐసోటోప్ కావలసిన పదార్థాన్ని, అల్యూమినియమ్ గొట్టాలలో (ట్యూబులలో) ఉంచి, యురేనియం ఉన్న ఆటమిక్ పైల్ అన్ని యంత్రభాగంలో ఉంచుతారు యురేనియమ్ అణువిభజన ప్రక్రియ సాగించినప్పుడు, జడివానలాగా ఈపదార్థాన్ని ద్వ్యాసుకొంటూ న్యూట్రానుల వర్షం పోతూ ఉంటుంది. ఇల్లా వారం రోజులుంచాక ప్రక్రియ ఆపుచేసి, రేడియో ఆక్టివ్ వస్తువులవిషయంలో తీసికోవలసిన జాగ్రత్తలన్నీ తీసికొని, ఈపదార్థం జాగ్రత్తగా వెలికితీసి, సీసపుతొడుగు దట్టంగా ఉన్న పెట్టెలలో ప్యాకింగ్ చేస్తారు. ఔన్సులో ముప్పైయోభాగం ఉన్న రేడియో ఐసోటోప్‌ను, సీసపుతొడుగులు దట్టంగా చుట్టి ప్యాకేజీ చేసేటప్పటికి ప్యాకేజీ బరువు 240 పౌనుడాకా తేలుతుంది

ఈపదార్థాలలో కొన్నిటి రేడియో ఆక్టివ్ శక్తి అతిత్వరగా క్షీణించకలదు కాబట్టి, ప్రయోగశాలలకు ఇల్లాంటివస్తువులను వెంటనే పంపివేసే జాగ్రత్తలు తీసుకొంటూరు.

వీటితో ప్రయోగాలు జరిగేటప్పుడు కూడా దట్టపు సీసపుతొడుగులను ముఖానికి దేహానికీ అడ్డు ఉంచుకుంటూరు.

ఈ రేడియో ఐసోటోప్స్‌తో చేసిన వైద్యప్రయోగాలు చాలా నూతన విజ్ఞానాన్ని సమకూర్చిపెట్టాయి.

మన రక్తనాళాల గొట్టపు పొరలలోనుంచి, అటూయిటూ, రోజుకు 20 పీపాల నీరూ ప్రవహిస్తూంటుందని, రేడియో హైడ్రోజన్ ప్రయోగాలవల్ల తెలిసివచ్చింది. రేడియో సోడియం వాడటంవల్ల, కుడిచేతికి ఇంజక్షనుగా ఇచ్చిన ఉప్పునీరు, 75 సెకన్లలో ఎడమచేతినుండి చెమటగా బైటికి వస్తుందని తెలిసింది రేడియో అయొడిన్ ప్రయోగంవల్ల, డాక్టరు శస్త్రవైద్యం చెయ్యటానికి ముందు, రోగిమెదడులో వ్రణం సరిగ్గా ఎక్కడుందో సూదిమొన వాసి తప్పకుండా తెలుసుకోటానికి అనువైంది రేడియోసోడియం రక్తంలోకి ఇంజెక్షన్ ఇయ్యటంవల్ల దేహమంతటా రక్తస్రావం సరిగ్గా ఉన్నదీ లేనిదీ, తెలిపి జబ్బుపడ్డ భాగాన్ని ఖండించవేయవలసిన అవసరం ఉన్నదీ లేనిదీ నిరూపిస్తుంది.

(రేడియో ఆక్టివ్ శక్తి ఉన్న వస్తువు దగ్గిర "గిగర్ కౌంటర్" అనే విద్యుద్యంత్రాన్ని పెడితే, యంత్రంలో సంచలనం కనిపిస్తుంది ఈ రేడియో ఐసోటోప్‌ను ఎంత ఎక్కువ మొత్తం పదార్థంలో నైనా, ఎంత స్వల్పంగా కలిపినా, యంత్రంలో కదలిక కనపడితే, ఆ మొదటి పదార్థభాగాలు ఈ యంత్రపరీక్ష జరుగుతూన్న ప్రదేశసమీపంలోకి వచ్చాయని తెలుస్తుంది. ఉప్పునీటి ఇంజక్షన్‌లో ఏమాత్రం స్వల్పంగానైనా రేడియో పదార్థం కలిపి, కుడిచేతికి ఇంజక్షన్ ఇచ్చినప్పుడు, ఎడమచేతిచెమటను గిగర్ కౌంటర్‌తో పరీక్షించితే "కౌంటర్"లో రేడియోఆక్టివ్ శక్తివల్ల సంచలనం కనిపించితే, కుడిచేతిలో ఇంజెక్షన్ ఇచ్చిన ఉప్పునీరు, ఎడమచేతి చెమటలో వచ్చేసిందని నిరూపితమౌతుంది ఈ సంచలనం ఎంతసేపటికి జరిగితే, అంతసేపటిలో, ఈ ఉప్పునీరే అక్కడికి వచ్చిందని నిర్ధారణ చేస్తారు. ఈ ప్రయోగంలో కుడిచేతికి ఇంజెక్షన్ ఇచ్చిన ఉప్పునీరు ఎడమచేతి నుంచి చెమటగా రావటానికి 75 సెకన్లు పట్టిందని రేడియో ఐసోటోప్ విధానం నిరూపించింది. ఈ నిరూపణకు ఇతరత్రా మరే భౌతికయంత్రంద్వారానూ అవకాశం ఉండేది కాదు.)

వ్యవసాయ పరిశోధనలలోకూడా ఈ రేడియో ఐసోటోప్పు చాలా ఉపకరించాయి. చెట్టువేళ్లలో తీసుకొంటున్న భాస్వరము, సరిగ్గా చెట్టుకాయలవద్దకు ప్రవహిస్తూండకపోయినట్లయితే చెట్టుకాపు తీతబట్టడం మొదలుపెడ్తుంది. ఇది తెలుసుకొనేందుకు రెండు ఒకేమాదిరి చెట్లలో ఒకదానికి మామూలుఫాస్ఫరస్, ఎరువులో రేడియో భాస్వరం కలిపి, చెట్టువేళ్ళవద్ద ఎరువు తొక్కారు. రెండో చెట్టుకు, మ్రాను మొదలులో రంధ్రంచేసి, రేడియో ఫాస్ఫరస్ కలిపిన ఎరువు కూరి, రంధ్రం మూశారు. వేళ్ళవద్ద ఫాస్ఫరస్ వేసిన చెట్టుకాయలు 'రేడియో' పరీక్షచేస్తే, కౌంటర్‌లో చలనం కలగలేదు అంటే వేళ్లవద్ద వేసిన ఎరువులో ఫాస్ఫరస్ కాయల కందలేదు. మ్రానులో రంధ్రంచేసినింపిన చెట్టుకాయలకు భాస్వరం అందింది.

ఇల్లాగే ఏ ఎరువు ఏ ఋతువుల్లో వేస్తే ప్రయోజనమో, అంటే చెట్టు ఎంతవరకు ఎరువు పుచ్చుకోగలుగుతోందో తెలుసుకొనేందుకుకూడా ఈ రేడియోఐసోటోప్ ఎరువులు చాలా ప్రయోగాలకు అవకాశమిచ్చాయి 125 పొలాల ఎరువులో చిటికెడుకన్న తక్కువ రేడియోఫాస్ఫరస్ వేసి, పొలంపంట అంతా అయాక ఎండుగడ్డిని "గిగర్ కౌంటరు"తో పరీక్షచేస్తే రేడియో ఫాస్ఫరస్ అంశ కనిపించింది. అంతే కాదు. ఆగడ్డితిన్న ఆవుపాలల్లోనూ, ఆపాలు తాగిన దూడ ఎముకలలోనుంకూడా ఈ రేడియో ఫాస్ఫరస్ అంశ గిగర్ కౌంటరు వెలువర్చింది

పరిశ్రమలలోకూడా, ముడివస్తువుల స్వభావము సరిగ్గా తెలుసుకొనేందుకు ఈరేడియో ఐసోటోప్‌లు చాలా ఉపయోగిస్తున్నాయి "చేతరబ్బరు" తయారుచేయటంలో వాడవలసిన గంధకంస్వభావం పరీక్షచేసేందుకు, రేడియో ఐసోటోప గంధకం వాడుతున్నారు పరిశోధకులు ఇల్లాగే, రాగి, ఇనుము, కోబాల్టు నిక్కెల్ మొదలైన లోహాల పరిశ్రమలలోకూడా ప్రశస్తవిధానాలు కనిపెట్టేందుకు ఈలోహాల రేడియో ఐసోటోప్‌లతో పరిశోధనలు సాగిస్తున్నారు బొగ్గుయొక్క రేడియో ఐసోటోప్‌వాడి ప్రయోగాలు సాగించటంతో, బొగ్గునుంచి పెట్రోలు తీసేవిధానాలు కొత్తవి కనిపెట్టగలుగుతున్నారు.

పెట్రోలు గనులవద్ద మైళ్లకొద్దీ పొడుగున పెట్రోలు పంపు గొట్టాలు భూమిలోనుంచి పోనియ్యాల్సి ఉంటుంది. ఈగొట్టాలను మధ్య మధ్య శుభ్రంచేసేందుకు, ఒక ఉక్కు చీపురు చట్రాన్ని వాడుతూఉంటారు. అది గొట్టాలలో ఎక్కడైనా అడ్డుపడిపోతే ఎక్కడ అడ్డుపడింది తెలుసుకోటానికి గొట్టం పొడుగునా తవ్వుకొని పోవలసివచ్చింది. ఇప్పుడా ఉక్కుచట్రానికి ఒక చిన్న గొట్టంలో రేడియోకోబాల్టు పోసి అంటగట్టారు

ఈ చీపురుదోవలో ఎక్కడ ఆగిపోతే అక్కడే ఈ రేడియోకోబాల్టు ఆగిపోతుంది దాన్నించి వచ్చే రేడియో ప్రసారాలు, పైన భూమిమీద ఉన్న కౌంటరులో తెలుస్తాయి అందుచేత గొట్టం ఉన్న త్రోవ వెంటే పైన భూమిమీదే ఒక గిగర్ కౌంటర్ను తీసుకుపోతే, కౌంటర్‌లో రేడియోసంచలనంవల్ల, గొట్టంలో ఉక్కుచట్రం ఎక్కడ ఆగిపోయిందీ ఇట్టే తెలిసిపోతుంది

ఈనాడు అమెరికాలో ప్రతిపరిశ్రమలోనూ వస్తువుల గుణగణవిశేషాలను నిర్ణయించే ప్రయోగాలలో ఈ రేడియో ఐసోటోపులు బాగా వినియోగిస్తున్నారు.

---

## కోహినూరు

(31-వ పేజీ తరువాయి)

సున్నము రాలిపోయి వజ్రమైన బయట పడింది. జైలధికారి యది కోహినూరని కని పెట్టి పట్టరాని సంతోషముతో తీసికెళ్ళి షాషూజావుల్ ముల్కుకు అందజేశాడు. షాషూజా దగ్గరనుండగా కోహినూరుపై యొక యాంగ్లేయుని దృష్టి పారింది. హిందూదేశ ప్రభుత్వము షాషూజా యొద్దకు యెలిఫిన్‌స్టను ప్రభువును రాయబారిగ పంపించారు. షాషుజా వజ్రాలతో మెరయు దుస్తుల ధరించి, కొహినూరును వక్షస్థలముపై ధరించి దొరకు ఆతిథ్య మిచ్చాడు. అనంతరం షాషుజా కాబూలునుండి తరుమబడి, తమ్ముడు షాజమానుతో వచ్చి పంజాబులో మహారాజా రంజితసింగు నాశ్రయించాడు. రంజిత్ మొదట యీ సోదరులతో స్నేహముజేయ సంకోచించియు, క్రమముగ వారి సొమ్ము లన్నియు తీసికొన్నాడు. రంజితు షాషుజా భార్యను హింసించినందున తప్పనిసరిగ, షాషుజా కోహినూరును రంజితు కిచ్చి, దాని ఖరీదుగ 40,000 డాలర్లను, తనకు,కుటుంబమునకు యేడాదికి సరిపడ ఖర్చులను పొందాడు. రంజిత్ సింగు కోహినూరును చేతికడియములో బొదిగించి యుత్సవసమయములలో ధరించువాడు. తదనంతర మావజ్రము లాహోరు భండారములో నుంచబడినది. 1849 లో పంజాబును జయించిన తర్వాత తూర్పుయిండియా కంపెనీవారు కోహినూరును విక్టోరియామహారాణికి బహూకరింప నిశ్చయింపగా, డల్హౌసిప్రభువు దానిని ఇద్దరు వున్నతోద్యోగుల రక్షణక్రింద 1850 లో లండనుకు పంపించాడు. 1851 లో జర్గిన లండను ప్రదర్శనములో నిది ప్రదర్శింపబడినది. అంతవరకు కోహినూరు ఆకృతి అనాది కాలంలో భారతీయవజ్రపుపనివారు కోసినట్లే యుండెను వారు వజ్రపుప్రమాణము తగ్గకుండునట్లు కోసిరి. దాని యాకార సౌందర్యమునకు ప్రాముఖ్య మియ్యలేదు. సుప్రసిద్ధప్రకృతిశాస్త్రవేత్త సర్ డేవిడ్ బ్రూస్టరు, మరికొందరు కలిసి కోహినూరును రేకులుతీరిన పరిపూర్ణ పద్మముగ జెక్కనిశ్చయించారు ఆమ్‌స్టర్‌డమ్‌లోని మెసర్స్ కొస్టర్స్ ఫాక్టరీకి జెందిన నేర్పరి వూర్సన్‌గర్‌కు కోహినూరును కోయుటకు దినమునకు పండ్రెండుగంటల చొప్పున 38 రోజులు పట్టింది. అందులకు 40,000 డాలర్లు (8000 పౌనులు) ఖర్చయింది. దాని ఫలితముగ 80 కారట్లు బరువు తగ్గింది. అసలు కోహినూరుపరిమాణము 186 1/16 కారట్లు; కోతవల్ల 106 1/16 అయింది. దాని ప్రస్తుతఆకారము లోతుతక్కువగల కమలము; వర్ణము స్వల్పధూసరము. కోతవల్ల విపరీతజ్వాలల నీనుశక్తి తగ్గింది. ప్రస్తుతము లండనుటవరులో రాజాభరణము భద్రపర్చు గదిలో కోహినూరు ప్రదర్శితమైయున్నది.



ఏప్రెల్ 9 న న్యూఢిల్లీలో సాంస్కృతిక సంబంధముల పరిషత్తుకు ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు.
అనంతరం మౌలానా ఆజాద్ అధ్యక్షోపన్యాసం చేశారు.

Regd No M 4479



Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press, 7 Thambu Chetty St Madras.